తొలిసారి : వెయ్యిప్రతులు
హక్కులు : కళాకేళివి
వెల : అర్ధరూపాయి
విజయ : శ్రావణ
1953 : ఆగస్టు



ప్రతులకు :
కళాకేళీ ప్రచురణాలయం: సామర్లకోట.
విశాలాంధ్ర ప్రచురణాలయం : విజయవాడ—2



Edited, Printed and Published by A. Somasunder· Pithapuram, for Kalakeli Publications; Samalkot, at Sri Rama Press, Samalkot.

నా ప్రాణంలో ప్రాణమై
నా హృదయంలో హృదయమై
నా రక్తంలో రక్తమై
విలసిల్లే అమృతనది—
వెలుగొందే అచలజ్యోతి—
సుస్వరూప కల్యాణికే

నారాయణ్

# సవరించండి

| పేజీ : | పంక్తి : | తప్పు : | ఒప్పు: |
|---|---|---|---|
| 7 | 16 | తిమ్మయ్యపై | తిమ్మయ్యగారై |
| 11 | 4 | ఖస్మారుల | ఖస్త్రాసుటుల |
| 18 | 4 | క్షేమాగ్ని | క్షామాగ్ని |
| 23 | 20 | రాక్షసోక్రి | రాక్షసోగ్రి |
| 24 | 5 | వీచుల | ఘాపుల |
| 35 | 8 | వీతహో | వీతిహో |
| 36 | 14 | ఇల్లుల్లూ | ఇల్లుఇల్లూ |
| 46 | 8 | సత్త | నత్త |
| 53 | 21 | గేతులలో | చేతులలో |
| 61 | 18 | .ర్పడిన | ఏర్పడిన. |



పాఠకులందరికీ నా నమోవాకాలు.
రెండవసారిగా ఈ రూపంలో నాగేయాల సంపుటిని మీకు సమ
ర్పిస్తున్న ఈ శుభ సమయంలో మీరు నాయందు చూపుతున్న
ఆదరాభిమానాలకు కృతజ్ఞత చెప్పుకుంటున్నాను. నా భావా
లతో లీనమై, నా హృదయానుభూతుల్ని మీలో విలీనం చేసు
కుంటూ, మీతో అవిభాజ్యుణ్ణిగా నన్ను భావిస్తున్న మీ అవ్యాజ
ప్రేమకు సర్వదా కృతజ్ఞుణ్ణి. మీ అందరి ముఖాలు నాకు నిత్యమూ
లీలగా కనిపిస్తూనే వుంటాయి. నా కావ్యాలను మీరు చదివిన
నప్పుడు మీ అందరి కనుల్లోనూ కలిగిన సంతృప్తీ, చిమ్మిస
అర్ద్రతా — నా కన్నుల ఎదుట సాక్షాత్కరిస్తూనే వుంటాయి.
మీరు నాకు ప్రేమతో వ్రాసిన ఉత్తరాలన్నీ చేరి, నా కావ్యాలు
చదివినప్పటి మీ అనుభూతులను అవ్యక్త భావాలతో నాకు
సువ్యక్తం చేస్తూనే వుంటాయి. కనుకనే కాహళి సందిస్తున్న
ఈ శుభ సమయంలో కవిగా నా కష్టసుఖాలను కూడా మీకు
నివేదించుకోవాలనిపిస్తోంది. అప్పటికి గాని నా హృదయం
లోని ఆవేదన చల్లారదనుకుంటాను.

నిజానికీనాడు కవిత్వానికి గ్రహణం పడుతున్నదేమో ననిపి
స్తోంది. కారణమేమంటారా — కావ్య ప్రమాణాలు నానాటికీ
క్షీణించి, కవిత్వమంటేనే అర్థం కాని దుస్థితిలోకి చాలాపుంది

సాహితీ కృషీవలుడు దిగజారి పోతున్నారు. ముఖ్యంగా కవిత్వ ఔచిత్యాన్ని చర్చించే పెద్దలూ పత్రికా రచయితలూ కవిత్వ తత్వ విచారాన్ని సాగించేటపుడు కవితను కవితగా కాక అన్యంగా స్వీకరిస్తూ కవితకే తీరని అపచారం చేస్తున్నారు. పైగా ఒక ప్రక్క నుంచి కేవల నినాద ప్రాయమైన కవిత్వం అన్ని రంగాలలోనూ తాండవిస్తున్నది. ఉదాహరణకి - రాజకీయ నినాదాలు, (నేటి సినీమా రంగంలోని) ప్రేమ నినాదాలు, నైతికోపదేశాలు కవితలో గోచరిస్తూనే వున్నాయి. వేరొక ప్రక్కనుంచి కవిత్వమంటేనే సాము గరడీల ప్రదర్శన మనుకునే ధోరణితో కేవలం (వృక్ష, జంతు, గణిత భౌగోళిక చారిత్రికాది) శాస్త్ర జ్ఞానానికి సంబంధించిన వివిధాంశాలను ఏకరువు పెట్టడంతోనూ మన సాహిత్యంలో రామరాజభూషణాదుల్ని – జేమ్సు జోయిస్ ప్రభృతుల్ని పునః ప్రాణప్రతిష్ఠ చేయాలనే ప్రయత్నం కనిపిస్తోంది. దురదృష్టవశాత్తూ ఈ రెండు ధోరణులూ ఉత్తర దక్షిణ ధృవాలై మన అనూన సాంప్రదాయసిద్ధమైన కవితామార్గానికి భిన్నంగా వర్తిస్తున్నాయని నా విశ్వాసం.

ఇందులో ఒక ధోరణి, రాజకీయాలుతప్ప అన్యవిషయాలను స్పర్శించడం ప్రజావ్యతిరేక అభ్యుదయ నిరోధక విధానమని నమ్మితే — వేరొకధోరణి, రాజకీయాలను స్పర్శించడమే కవిత్వానికి కళంకమని నమ్మతోంది. ఒకరు నిరంజన ప్రబోధవాదులైతే, వేరొకరు నిరంజన కళావాదులౌతున్నారు. ఈ రెండు

కోణాలకు భిన్నమై, సమన్వయమైన మధ్యేమార్గమొకటున్నదని, అదే కవిత్వమని ఈ రెండు ధోరణులూ విస్మరిస్తున్నాయి. కనుకనే వీరి ధోరణులవల్ల అనుస్యూతమైన మనకవితా సాంప్రదాయం ఆచరణలో భగ్నమౌతున్నది; హృదయ సంబంధిగా మానవ రసావేశ ప్రేరేపకంగా ఉండాల్సిన పరమప్రయోజనం భంగపడుతున్నది. అభ్యుదయ దృక్పథంగల రచయితలలోనైనా లక్ష్యాశయంలో భావైక్యత ద్యోతకమౌతున్నదేగాని తదితరులలో అదికూడా మృగ్యమౌతున్నది. పోతే, ఒకరికి రాధాకృష్ణుల ప్రేమేతిహాసమూ, బుద్ధముని కారుణ్య జీవనమూ మాత్రమే కవితావస్తువులైతే — మరొకరికి రామాయణ కల్పవృక్షమఫలాలను కవితలో అన్వేషించడమే వ్యాపారమౌతున్నది. నేరొకరు ఈలోకసత్యాలకావలి తమిస్రగర్భంలో మునిగి జీవజ్యోతికోసం తడుముళ్లాడుతున్నారు. మరొకరు స్త్రీ పురుష సంబంధాలు, విరహాలు, ప్రేమ, కోయిల, వసంతం తప్ప యితరవిషయాలు తమకుపడవని భీష్మించుకు కూర్చున్నారు. ఈ విధంగా నేటి మేధోజీవితమే ఒక భావకల్లోలంలో ఊగిసలాడిపోతున్నది. జననంగాని లేదా మరణంగాని జీవితంకాదనీ, ఈ రెండిటి మధ్యనూగలదే జీవితమనీ చాలామంది గ్రహించినట్టు కనిపించదు.

ఐతే అనాది దశ నుంచీకూడా భౌతిక ప్రపంచానికి ఆంతరంగిక ప్రతిబింబంగా రూపొందే భావ సముచయాన్ని ప్రకటించేందుకే కవితా స్వరూపం నిర్దేశితమైంది. ఈ దృష్టితో గనక మనం

మన కవితామ్నాయాన్ని శోధిస్తే ఋగ్వేద కాలం నుంచీ నేటి వరకూ కవిత్వానికేది నిర్ణాయకశక్తో బోధపడుతుంది. మానవ హృదయంలోని రెండు ప్రేరేపకశక్తులు (Catalitic Agents) ఆవేశమూ అనుభూతీ అనేవి మాత్రమే. ఇవే యితివృత్తానికి కవితాస్పందనలు కలుగచేస్తాయి. కనుక ఈ నిర్ణయంతో మనం చూస్తే ఋగ్వేదం నుంచీ వచ్చిన కవితావేశం ప్రతీ దశ లోనూ ఏదో ఒక ప్రయోజనాన్ని ఆశిస్తూ వచ్చిందనేది నిర్వివాదాంశమే.

"ఎవరైతే మా భూముల నాక్రమిస్తారో, ఎవరైతే మా యజ్ఞ యాగాదులను ధ్వంసం చేస్తారో, ఎవరైతే మా స్త్రీల మానభంగం చేస్తారో అట్టి రాక్షసుల ప్రాణాలను తీస్తాం. అట్టివారి నెత్తుటితో తర్పణచేస్తాం. వారి రక్త మాంసాదులతో మా దేవతలను తృప్తిపరుస్తాం."

అని మహోద్రేకంతో నాటి సమాజానికి శత్రువులైన రాక్షసులకు వ్యతిరేకతను ప్రకటించ వలసిన అవసరం ఋగ్వేద కవులను ప్రధానమైంది. అలాగే మధ్యయుగాలలో కర్మకాండాలులైన నిగమ శర్మాదుల సంస్కరించి పరివర్తించ వలసిన ప్రయోజ నమే తెనాలి రామకృష్ణకవి వంటి వారికి అవసరమైంది. ఏమైనా, ఎప్పుడైనా, ఆనాటి సాంఘికాది బాహ్య స్థితిగతులే ఆనాటి కవిచైతన్యాన్ని ప్రకోపింపచేసి అతనికి గల కావ్య పరి మితిలో సుప్రయోజనాన్ని సాధింపచేస్తాయి. గణితంలోని సమస్యలకు పరిష్కారంపచె ఋట్టి సాధన కూడా ఉత్తమ సాధ

కుతైన కవులకు కరతలామలక మవుతుంది. ఆంధ్ర సాహిత్య చరిత్రను ఏమాత్రం పరిశీలించిన వారికేనా ఈ పరిణామశీలత సువ్యక్తమవుతుంది. పోతే శిల్పంగాని, రీతిగాని, శైలిగాని ఈ కాలంలో యిన్నిన్ని పాళ్ళల్లో కవిత్వాని కవసరమని నిర్ణ యించడం న్యాయం కాదు. వస్తువునుబట్టి శిల్పంకూడా వుం టుంది. కనుక ఇదే సరైన కావ్యస్వరూపమనీ, రీతిఅనీ, లక్ష ణమనీ నిశ్చయించడం అవివేక మవుతుంది.

నేను తొలి కావ్యసంపుటి ద్వారా మీ అందరి దర్శనం చేసు కుని విజయ వసంతానికి నాలుగు వత్సరాలు నిండిపోయాయి. వజ్రాయుధం ఇటు పాఠకులలో చైతన్యాన్నీ — అటు పాలకు లలో సంచలనాన్నీ కలిగించింది. ఎటొచ్చీ కేవలం విమర్శ కులలోనే విపరీతమైన గంద్రగోళం వచ్చింది. ఇంచుమించు ప్రముఖ పత్రికలన్నీ ఈ గ్రంథాన్ని సమీక్షించాయి. ఒళ్లు జల దరించే ప్రశంసలను కురిపించాయి. కుశంకలను సైతం లేవ దీశాయి. ఏమైనా ఆ విమర్శకులు ప్రకటించిన అంశాలను ఈ సమయంలో సమాలోచించు కోవడం అనవసరమూ అసందర్భ మూ కాదనుకుంటాను. కనక ప్రశంసలమాట అటుంచి సోదర రచయితలు లేవనెత్తిన కుశంకల నుల్లేఖించి నా సమాధానా లివ్వటానికి ప్రయత్నిస్తాను.

శ్రీసెట్టి ఈశ్వరరావుగారు విశాలాంధ్ర పక్షపత్రికలో, 1-7-19ని వజ్రాయుధాన్ని సమీక్షిస్తూ "వజ్రాయుధంలో వజ్రపుమెరుపు లెన్నో కనిపిస్తాయి. కవి భావన బరువునీ ఉద్రేకపు బిగువునీ అందుకోలేని కొన్ని పంక్తులున్నా చప్పని వచనంలాగ విని పించే కొన్నిసందర్భాలున్నా ఈకావ్యం ఉత్తమాదర్శ ప్రేరితం. అంచేత ఉత్తమకావ్యం." అన్నారు.

ఉత్తమాదర్శ ప్రేరితం కనక ఉత్తమకావ్య మౌతుందా అనే ప్రశ్న ఏమాత్రం బుద్ధిమంతుడికేనా కలుగుతుంది. శ్రీసెట్టి ఈశ్వరరావుగారి యందు వ్యక్తిగతంగా నాకెంతో గౌరవమున్న ప్పటికీ యిట్లాంటి సిద్ధాంతీకరణని ఖండించక తప్పదు. అంచా తనంటే ఉత్తమాదర్శాలతో కూడిన, రాజకీయోపన్యాసాలన్నీ ఉత్తమ కావ్యాలవుతున్నాయా? కాలేవు కనుకనే శ్రీ వాసిరెడ్డి భాస్కరరావుగారు 15-8-49 విశాలాంధ్రలో సంపాదకునకు లేఖవ్రాస్తూ పై సంపాదకుల అభిప్రాయాన్ని ఎదుర్కొన్నారు. ఆయన - "చక్కని విషయంతో కూడివున్నా కళాసౌష్టవంలేక వట్టి నినాదాల బోర్డుల్లాగ వుంటే వాటిని తిరస్కరిస్తా" మన్న మావ్‌సెటుంగ్ వాక్యాలను ఉల్లేఖించి సంపాదకుని అనిర్దిష్టమైన ప్రతిపాదనను ఖండించారు. దురదృష్టవశాత్తూ మిత్రులు ఈశ్వ రరావుగారు, శ్లేష్మంలోపడ్డ ఈగలాగై - సమీక్షలో "వజ్రా యుధంలో వజ్రపు మెరుపులెన్నో కనిపిస్తాయి" అని ప్రకటిం చినవారి భావాన్ని మరచిపోయి, వాసిరెడ్డిగారుల్లేఖించిన వాక్య

ముతో ఏకీభవిస్తున్నట్టు నటించి, ఆ భారం వజ్రాయుధంపైకి త్రోసి తప్పుకున్నారు. వా సి రె డ్డి గారుదహరించినట్టుగా దస్కాని విషయంతో కూడివున్నా కళాసౌష్టవం లేక పట్టినిసా దాల బోర్డులాగ వున్న ఏకావ్యాన్నికాని తిరస్కరించవలసిందే! కావ్యరచనకి ఉత్తమాదర్శమేకాక ఉత్తమ కళాసంపదకూడ ముఖ్యమవుతుంది. అయితే వజ్రాయుధంలో అట్టి కళాసంపద వున్నదా లేదా అన్నది ప్రధాన సమస్య. దీనికి సమాధానాన్ని నాకన్న సమర్థనీయంగా నావిమర్శక సోదరులే యిచ్చారు: కనుక వారి వాక్యాల్ని యిక్కడ ఉదహరిస్తాను:

"అనంత మానవ హృదయ సత్యోన్మీలనమేకదా కవిత్వం. వజ్రాయుధం యిలాంటి ఉత్తమ శ్రేణికిచెందిన కావ్యం. నేటి మానవ సంఘర్షణలో పీడిత ప్రజాహృదయానికిది ప్రతిబింబం. వారికర్తవ్య పథానికిది ఉద్దీపకం. ఈ కావ్యంలోని ప్రతి పద్యమూ సున్నితమైన భావప్రకంపనం కలిగిస్తున్నది. పీడిత ప్రజాహృదయ వీణాతంత్రుల్ని కదిపి మేళవింపు కలిగిస్తున్నది. గతిబద్ధంగా రీతి బద్ధంగా తనకు తెలిసిన నీతులనో, నిసాదాలనో వర్ణించడం కాక, (క్రిందిగీత నాది—సో. సు.) — లోకాన్నిదాటి చీకటి కోనల్లోచేరి చేసే ఆర్తనాదమూ కాక పట్టుమని పదిమందిలేని విలాసపరుల ఊడిగపు వీవనలను విసరడమూ కాక — నిజమైన కవిత్వధర్మాన్ని గుర్తించి గానం చేస్తున్న ఈకవి అభినందనార్హుడు.

ఈ ఉత్తమ కావ్యం (సో. సు) ప్రతిపాటా చదవ
తగినది. ఇలాంటి కవిత్వాన్ని మన కిచ్చినందుకు
సోమసుందర్ మన్ననలకు పాత్రుడు."

[శ్రీ విద్వాన్ విశ్వం : నవ్యసాహితి : 26—6—49.]

విద్వాన్ విశ్వంగారికి ఉత్తమ కావ్యంగా, కళాఖండంగా కనిపించిన వజ్రాయుధంలో సెట్టి ఈశ్వరరావుగారికి చప్పని వచనంలాగ వినిపించే సందర్భాలు కనిపించాయంటే ఆశ్చర్యకరంగా లేదా? కావ్యమూల్యాలు కావ్యౌచిత్యాన్ని ఎంత నిర్దేశించేవైనప్పటికీ, వాటిని గ్రహించ గలిగిన వ్యక్తిగత సంస్కారంకూడా ప్రధానమౌతుంది కదా!

ఇంతకన్నా చిత్రమేమిటంటే — నా "వజ్రాయుధంలో శోభనా విలువలను వదలడం అస్పష్టమైన పదాల హోయలకు విలాస రీతులకూ పోనడం కనిపిస్తోం" దని శ్రీ కారుమంచి వెంకటేశ్వరరావుగారి నగారా విమర్శించటం. పైగా వీరే "అక్కడక్కడ కవిత్వంపాలు హెచ్చి" పోయిందని విమర్శించారు. ఈశ్వరరావుగారి దృష్టిలో ఎక్కడైతే పజ్రిపుతునకల్లాంటి మెరుపులు మెరిశాయో అక్కడే నగారా వారికి కవిత్వంపాలు హెచ్చిపోవడమే కాకుండా — "గతకాలపు బూర్జువా భావకవిత్వపు ప్రభావం బైటపడిం" దట! అయితే సెట్టి ఈశ్వరరావుగారికి చప్పని వచనంలా వినిపించిన వాక్యాలు నగారా వారికి అద్భుతమైన కళా ఖండాలుగా కనిపించాయి కాబోలు!

ఇలాంటి పరస్పర విరుద్ధభావాలను ప్రకటించిన విమర్శకుల మార్క్సిజాన్ని విలువించవలసి వస్తుంది. అయినప్పటికీ అది ఈ పరిమితిలోనిది కాదు కనుక యిక్కడ జనవాణి వాక్యాల్ని ఉపహరిస్తాను :

'నేటి అసమ సమాజ వ్యవస్థలో అట్టడుగున చిక్కుబడిని పైకి రావాలని ప్రయత్నం చేస్తున్న పీడిత ప్రజల ఆవేదననూ, ఆవేశాన్ని ముక్తకంఠంతో వెలువరించి అవనిని నిరాశాహతుని చేయకుండా ముందుకు నడవమని ప్రోత్సహించే ఉత్తమకావ్యం.' ఆలిండియా రేడియో మద్రాస్ కేంద్రం నుంచి శ్రీ యస్. ఆర్. చంద్రహార్ వజ్రాయుధాన్ని సమీక్షిస్తూ, 'సోమసుందర్ కలంలో మంచి తీక్ష్ణత వుంది. ఆయన గేయం బాణంలా దూసుకు పోతుంది. శ్రీ సోమసుందర్ విప్లవకవి. వర్గాలమధ్య వైరుధ్యం నశిస్తేగాని మానవుడికి హాయిలేదంటాడు. ప్రజాశక్తి వజ్రాయుధం. దాని ఆసరా తోనే మానవ స్వర్గం నిర్మించాలి.' అన్నారు.

ఇంతా చిత్రమేమిటంటే ఆంధ్రదేశంలోని రాష్ట్రీయ స్వయం సేవకులకు సాధికార వాణి జాగృతి ; బాధాప్తత జగత్తుకు మార్క్సీయ తత్వశాస్త్ర మొక్కటే విముక్తి దాతయని నమ్మే నా ఆదర్శాన్ని, పైన పేర్కొన్న నానావర విమర్శకులచే ప్రశంసించబడిన 'ఉత్తమాదర్శాన్ని' ఈ పత్రిక — అధమాధమాదర్శంగా పరిగణిస్తుండడంలో ఆశ్చర్యంలేదు. మార్క్సిజంలో

దానికి ఇష్టమైనదేమీ కాకుండా ఆ జన్మ శత్రుత్వం కూడాను. అం
చేత జాగృతి వజ్రాయుధాన్ని పరిచయం చేస్తూ "అభ్యుదయ
సాహిత్యం పేరిట ఇటీవలి రోజుల్లో తెలుగుగడ్డమీద అవత
రించిన మార్క్సిజం ప్రచార సాహిత్యారణ్యంలో ఇదో మహా
వృక్షం" మనటంలో కించిత్తూ ఆశ్చర్యంలేదు. కాని అలాంటి
వారే వజ్రాయుధాన్ని ప్రశంసిస్తూ "యువకుడైన కవి హృద
యంలోంచి విప్లవం అక్షరరూపంగా వచ్చింది. భావాత్మకంగా
వున్న ఈ గేయ సంపుటి కళాదృష్ట్యా ఒక ఉన్నతస్థానాన్ని అందు
కోగలదు. గేయాలలో అగ్ని ప్రజ్వరిల్లుతున్నది." అనగలిగి
నప్పుడు మన మార్క్సిస్టు విమర్శకులు వజ్రాయుధంలో కళ
లేదనటం ఆశ్చర్యంగా లేదా? ఇంతకీ కారల్ మార్క్స్ 'వస్తు
వూ శిల్పమూ అవిభాజ్యాలు' అని స్పష్టంగా చెప్పినప్పుడు --
వజ్రాయుధంలో కళపాలు హెచ్చిందని కొందరూ, కళపాలు
తగ్గిందని కొందరూ వాద ప్రతివాదాలు సాగించడం వాళ్ల
మార్క్సీయవాదాన్ని, వారి కళామూల్యాలనూ శంకింపచేయదా?
జ్యోతిలో శ్రీ బోలవరపు శ్రీహరిరావుగారు (రాడికల్ డెమో
క్రాటిక్ పార్టీ ముఖ్యుడు.) ప్రస్తావ వశాత్తూ "వజ్రాయుధంలోని
గేయాలు ప్రభుత్వ రీతుల్ని ఛిన్నాభిన్నం చేయగలవని — ప్ర
భుత్వమే భయపడి అనుకుంటాను—దానిప్రతుల్ని జప్తుచేసింది.
అయితే ఈ జప్తుచర్య జరక్కముందే అనేకులం ఆ గేయాలను
చదివాం. గ్రహించవలసింది గ్రహించాం. ఈ పరంగా ఈ
రచయిత ఆంధ్రపాఠకులకు చిరపరిచితుడు." అని వ్రాశారు.

ఇంతకంటే వజ్రాయుధం కళాసంపన్నమైనదనడానికి నేను వేరే సమాధానం చెప్పనవసరం లేదనుకుంటాను.

పోతే కారుమంచివారి నగారా—వజ్రాయుధాన్ని సమీక్షిస్తూ నేను "గతకాలపు బూర్జువా భావకవిత్వ ప్రభావాలనుంచి పూర్తిగా బైట పడలేద" న్న వాదాన్ని పరిశీలిద్దాం. ఇంతకీ అభ్యుదయ కవిత్వం అకస్మాత్తుగా ఆకాశంనుంచి వూడి పడ్డదని ఎంతబుద్ధి హీనుడూ కూడా అనలేడు. మన కవితకు అనూనమైన సాంప్రదాయముంది. భర్తృహరి, బమ్మెరపోతన, ధూర్జటి మున్నగు మహాకవులు నాటిన బీజాలనుంచే నేటి అభ్యుదయ కవితోద్యమం విస్తరిల్లింది. భావకవిత్వం కూడా అభ్యుదయ కవితోద్యమానికి యథోచితంగా మాతృత్వమే వహించింది. కనక గతంలో అనేక శతాబ్దాల కాలపథంలో శ్రమిస్తూ వచ్చిన మానవ సాంస్కృతిక రస సాంప్రదాయానికి మన అభ్యుదయ కవిత్వం వారసత్వం వహించడం సహజమైన సజీవలక్షణమే. అంచాత అభ్యుదయ కవితలో భావకవితా రీతులుండటం నేరం కాదు; పైగా అది పూజించ వలసిన సుగుణమవుతుంది. పోతే ఇక 'బూర్జువా ప్రభావం' మాట తీసుకుందాం. భారత దేశంలో 'సరైన' బూర్జువా ప్రభావం ఏసాహితీ రూపంపైనా లేనేలేదని మార్క్సిస్టులంతా అంగీకరిస్తున్నారు. భారతదేశం అర్ధ భూస్వామ్య అర్ధ పెట్టుబడిదారీ వ్యవస్థల కూటమి అని ప్రముఖులంతా అంటున్నదే. భావకవితోద్యమం ఇంగ్లండులోని

భూస్వామ్య భావాలపై సాగిన అభ్యుదయ విప్లవంగా మార్పు
స్తుంటున్నాము. భారతీయ సాహిత్యంపై నాటి పరోక్ష ప్రభా
వం సోకటంలో ఆశ్చర్యంలేదు. అట్లాంటి భావకవితోద్యమం
నుంచే అభ్యుదయ కవులం నూతన భావకవితోద్యమాన్ని (Neo
Romanticism—సిడ్నీ ఫింకెల్‌స్టీన్ మాటల్లో) సృష్టించ గలి
గాం. ఇల్యాఎహ్రెన్‌బర్గ్ అన్నట్టుగా — వర్తమానాన్ని గౌర
వించలేనివాడు గతాన్నికూడా గౌరవించలేడు. అవిధంగానే
గతాన్ని గౌరవించలేనివాడు వర్తమానాన్ని కూడా గౌరవించ
లేడు. కనక సుబ్బనగారా విమర్శకులకు యింతకన్న నేను
చెప్పవలసిన దేముంది ?

నాకు వలయా పరిభంజనంలోని 4, 5, 6, భాగాలలో చాలా
వరకూ సాంకేతిక కవిత్వ ముందంటే ఉలిక్కిపడి పరిశీలించాను.
అందులో ఉపమారూపకాది అలంకారాలు తప్ప, సాంకేతిక కవి
త్వమేమీ నాకు కనిపించలేదు. బహుశా సింబోలిజానికి అలం
కారాలనే అర్థాన్ని వారూహించారేమో నాకు తెలియదు. పోగా
బాడుగగోడీలనే కావ్యంలో ఫార్మలిజానికి మొదటిభాగం ఉదా
హరణ అన్నారు. నేను బాడుగగోడీలలో — సామాన్యంగా
కవులువాడే Poetic Emphasis నే వాడాను. ఆ యితివృత్తం
అలాంటిది ! అందలి జుగుప్సనీ, భీభత్సాన్నీ పాఠకుని మన
స్సులో గాఢంగా హత్తుకునేటట్లు చెప్పాలి. పుంతలో పారేసిన
ఎర్రని గుడ్డలాగ లోకంచే విసర్జించబడి నికృష్టజీవితం గడుపు

తున్న పడుపువృత్తితో బ్రతికే స్త్రీల జీవితచిత్రాల విషాదా కృతిని చిత్రవిచిత్ర వర్ణాలలో ఆలేఖించి చూపించడం నావిధి. ఇందులో శబ్దాలుకాని, భావాలుగాని నీటికన్నా నిర్మలంగా కనిపిస్తాయి. ఇందులోవున్న ఫార్మలిజమేమిటో వారే వివరించాలి మరి !

ఏమైనా నాజాతి సోదరప్రజలకు నేను బోధించ వలసివున్నదనే అంతర్ ప్రేరేపణే (Inner urge) లేకపోతే కవిత్వం రాయడం మాని నే నేనాడో చాలామందికిమల్లే కట్టెలవ్యాపారం చేసుకునే వాణ్ణి. అయితే, కేవలం బోధనామూల్యాల కోసం కళామూల్యాలను పరిత్యజించి "కాంతా సమ్మిత తయోపదేశయుజే" అనే కవితానూన సాంప్రదాయానికే తిలోదకాలిచ్చి – కవిత్వం పేరుతో శుష్క రాజకీయోపన్యాసాలిమ్మంటేమాత్రం నేను సిద్ధంగాలేను. కేవలం బోధనామూల్యాలను మాత్రమే గౌరవించ దల్చుకుంటే — అలాంటి రచనలు ప్రభుసమ్మితాలై పూరుకుంటాయి. వాటి చేరువకు కావ్యత్వమనేది రాదు; సరికదా పాఠకులుకూడా రారు. ఉన్నత శిఖరం నుంచి ఉపదేశించే పని ప్రభువులూ, నాయకులూ, సన్యాసులూ చేస్తే చెల్లుతుంది కాని కవులు చేస్తే చెల్లదు.

ఇటు అభ్యుదయ సాహిత్య శిబిరంలోనివారుగాని, అటు ఇతరులుగాని వజ్రాయుధంపై పరస్పర విఘాతమైన విమర్శలు

చేశారు. అయినప్పటికీ ఏదో ఒకమూలనుంచి ఈవిమర్శకు వే వజ్రాయుధంపై ప్రశంసల్ని క్ష్వాడ్గా కురిపించారు. కనుక నే వజ్రాయుధాన్ని ప్రచురించి నాలుగేళ్లు గడచిన ఈసమయంలో పరాత్మక దృష్టితో దాన్ని పరామర్శిస్తున్నకొద్దీ ఆసంపుటిపై నాకున్న గౌరవం ఇనుమడిస్తున్నది. అంతమాత్రంలో దానిలో గుణాలేగాని దోషాలు లేవని నేను పనవి చేయడంలేదు. ఏమైనా — "ఏకోహి దోషో గుణసన్నిపాతే - నిమజ్జతీన్దోః కిర ణేష్వివాంకః" అని; చంద్రికిరణాల చలువలో చంద్రుని మచ్చ విస్మరింపబడినట్టు - అనేక సుగుణాలలో ఒక దుర్గుణం లెక్క కురాదన్న కాళిదాస మహాకవి వాక్యాన్ని వజ్రాయుధం విషయం లోకూడా మనమంతా స్మరించుకుందాం!

ఇంతకీ నేను చెప్పవలసినదొక్కటే; పైన పేర్కొన్న విమర్శ కులంతా లేనిపోని కొత్తసమస్యలనూ, 'చొప్పదంటు' సందేహా లను వెలిబుచ్చి అనవసర కల్లోలాన్ని సృష్టించారు. విమర్శకు లెవరైనా - ఏకావ్యానైనా విమర్శ చేయవచ్చును. కాదనేటం తటి అవిజ్ఞత నాకులేదు. కాని కావ్య విమర్శకులు కవిత్వ లక్ష ణాలను పాటించకుండాచేసే విమర్శవల్ల కావ్యానికేకా కమొత్తం కవిత్వానికే అపచారం కలుగుతుందని విన్నవిస్తున్నాను.

అప్పుడప్పుడు నాకున్నా భర్తృహరి మహాకవికి మల్లే ఒక్కటే విచారం కలుగుతూ వుంటుంది:

"బోద్ధారో మత్సరగ్రస్తాః
ప్రభవస్మయ దూషితాః
అబోధోపహతాశ్చాన్యే -
జీర్ణమఙ్గే సుభాషితమ్‌ః"

విద్యావంతులా ఈర్ష్యాళువులైనారు. ప్రభువులా గర్వాంధులైనారు. నిరక్షరాస్యులకా గ్రాహ్యశక్తి లేదు. కనుక నా ఈ సుభాషితాలన్నీ నాలోనే అణగిపోతున్నాయి అని దుఃఖిస్తాడు భర్తృహరి. నిజమే! నేడుకూడా జ్ఞానవంతులనదగు వారు మత్సరగ్రస్తులై కవితాదూరులౌతున్నారు. ప్రభువులు గర్వాంధులై నిరంకుశత్వాన్ని పహిస్తూ, పజాప్రియుధాన్ని నిషేధించారు; కాని, నేడు సామాన్య ప్రజలుమాత్రం నిజానిజాలను నిష్పక్షపాతంగా గ్రహిస్తూ, ఉత్తమకవితనాస్వాదిస్తూ జ్ఞానపంతులౌతున్నారు. ఇదే నాకున్న అదృష్టమల్లా!

చిరకాల వాంఛితమైన ఆంధ్రరాష్ట్రం ఏర్పడనున్న ఈశుభసమయంలో మీ కీ కాహళిని సమర్పిస్తున్నాను. ఆంధ్రరాష్ట్ర వాంఛను ఉద్ఘోషించిన ప్రజాహృదయాన్నీ, విశ్వశాంతికై పరితపించే జగజ్జన మనోభావాలనూ కవితారీతిలో ప్రతిబింబించడానికి ప్రయత్నించాను. ఇంతకన్న కాహళిని గురించి నేనేమి చెప్పగలను? చదివి మీరే నిర్ణయించుకుందురుగాక! ఐతే, ఒక్క విషయం:

వజ్రయుధం తర్వాత వెంటనే వ్రాసిన కావ్యాలు కాహళిలో లేవు. ఆకావ్యాలన్నీ రక్తాక్షి, ఆగ్నేయనేత్రం, సోమరసం— సుందరకాండ వంటి పుస్తకాలలో సంపుటీకరించ బడ్డాయి. మీ దయవల్ల పరిస్థితులు మేలుచేస్తే అచిరకాలములోనే వాటినికూడా కళాకేళి మీ ముందుంచగలుగుతుందని నా విశ్వాసం.

జాబులు వ్రాస్తూండండి.

ఇప్పటికింతే సంగతులు.

పిఠాపురం,
15-8-53.

[signature]



# క్రాంతిగీతి

అరుణారుణ క్రాంతి జ్యోతి
అఖిలాశయ ముక్తిగీతి
జగతికి సంక్రాంతివేళ
వెలిగించుము కాగడా!
పలికించుము నగారా!!

నూత్న ప్రజాస్వామికమ్ము
జగతికి ప్రగతీప్రసవము
సర్వలోక కళ్యాణో
త్సవ వేళావికసితమ్ము
జగతికి సంక్రాంతివేళ
వెలిగించుము కాగడా!

రుజాగర్భ వృద్ధజగతి
కుద్వాసన చదువువేళ
నవ్యారుణ సమధర్మో
ద్ధరణకు స్వాగత సమయము
జగతికి సంక్రాంతివేళ
వెలిగించుము కాగడా!



# తెలుగు వెలుగులు

మన తెలుగు వెలుగులకు శాపమింకెన్నాళ్లు ?
మన తెలుగు యెలుగులకు పాశమింకెన్నాళ్లు ?
మనసులో మర్మాలు విడిచి మాట్లాడండి ;
మన నొసటికర్మలను తుడిచి పోట్లాడండి.

మన ముడుపులనుదోచి కన్నీరు వరమేల ?
మనకడుపు చెరువులో వేల నెరియలవేల ?
పసికందు బ్రతుకులను తలచియోచించండి;
పసిడివెన్నెల సొగసు వలచియోచించండి.

నక్కలకు మనచేను లర్పించుటెన్నాళ్లు ?
కుక్కలతొ తగువాడి కూడుతినుటెన్నాళ్లు ?
మనపూర్వ శోభలను తలచుకొని తెలుపండి;
మనపూవుటెడదలను వాడనీయకరండి.

కడిమిపూవుల సువాసనలు జల్లినదారి——
పడతిమోదుగ సుహాసముల కెంపులదారి——

ఈదారి తెలగాణ విలువలకు తార్పినుగా;
ఈదారి నలగొండ మనుగడకు మూసగా;
తెలుగు పొలముల పైడిపంట కాణాచిగా;
వలపు విరిదేనియల సిరులపూబంతిగా;

మొలచినందుకు ఫలము లీఘోరకలియా ?
వెలసినందుకు ఫలము లీయుపద్రవమా ?

కరువుకొండల చెరియశోకాల నదులేల ?
కరువు-నరులకు కొండచిలువ బంధాలేల ?
శ్రీనాథ కవిరాజు సాక్షిగాపలుకండి;
పెద్దనార్యుని పేర ఆనలిడి తెలుపండి.

ఈరేయి యిరులు కొనసాగుటింకెన్నాళ్ళు ?
ఈమాయ గొలుసులింకెల మనుటికెన్నాళ్ళు ?
కలకంఠి కన్నీటివారి నిలుపగరండి;
మొలబంటి-ఏడుపుల మడుగు ములుగకరండి.

ప్రజలు విషనాగులని తెలుపకారణమేమి ?
మంత్రిగారే దొడ్డమంత్రగాడగుటేమి ?
విషనాగు తనవేయి పడగలెత్తుక నురికి—
కాటందు కొనగానె కీడంతరిస్తుంది!

మన తెలుగునాటికీదాము లింకెన్నాళ్లు ?
మన తెలుగువాకిటను పాములింకెన్నాళ్లు ?
అనుమర్లపూడి, కస్తూరి, చింతందాసు,
మృత్యుంజయుల ఆత్మసాక్షిగా తెలుపండి.



# నామాలకౌరవి

నామాలకౌరవి మళ్ళీగద్దెకెక్కింది....
నల్ల కళ్ళద్దాల చీకటే వచ్చింది....!
మనకి మళ్ళీ ఏలినాటిశనియేనా ?
మనతోట చిగురించు ఒట్టిమాటేనా ?

మదరాసులో మంచినీటి కరువొస్తేను—
తెలుగు కన్నీళ్ళనే సరఫరా చేయాలి !
కడపబడుగుల కడుపుచిచ్చు నార్పేందుకై —
గంజినీళ్ళకు 'కరువు' మొహము వాచుండాలి !

రాయలాసీమకే రాచ్చిప్ప లొచ్చాయి !
కరువులకు కారణం కరియప్ప చెప్పాడు:
"ఎలుకలూ, మనుషులూ కనరాదు పిల్లల్ని,
బ్రతకాలి ప్రజలుతిని రాళ్ళనీ రప్పల్ని!"

["ఎందరో కరియప్ప భార్య సంతానమ్మ?"
అని మనముప్రశ్నించ మిలిటరీ వస్తుంది(!?)]
కరువు చిచ్చొచ్చుప్పటకు గంజినీళ్ళేలేవు—
తంజావూర్ సత్రముకు సన్నబియ్యాలంట !

విస్సన్న చెప్పింది వేదవాక్కయిపోతె—
అస్సాయి బుస్సాయి కబురులను మేయాలి !

నేలంత నెరియలే, చెట్లన్ని మోడ్రిడుతే—
పసిబిడ్డ పెదవులకు కన్నీరె క్షీరాబ్ధి!

మన తలలపై లక్ష ప్రశ్నార్థకాలుండ,
మనబ్రతుకు కుండలో దుఃఖాశ్రువులుండ—
ఇంగ్లీషువాడొచ్చినాసరే వర్షాలు
కురియవని గొప్పగాచెబుతుంది కొరకంచు!

ఏకజాతేమనము ఏకదేశీయులమె
భాషాభిమానాలు మంటకలవాలంటు—
గద్దెకెక్కిన గుంటనక్కన్న మాటలకు
భళిభళీ అనివంతపాడాడు శ్రీప్రభువు!

మనకిమళ్ళీ ఏలినాటిశనియేనా?
తెలుగు పెడదలకలలు నీటిఅలలేనా??
మనకిమళ్ళీ పాతగాథలే శరణా???
తెలుగు బిడ్డల ఆశ నీటిమూటేనా????



# విన్నవీ...కన్నవీ..

విన్నవీ కన్నవీ విన్నవిస్తున్నాను—
చెవులొగ్గి వినరండి తెలుగులంతా నేడు!
రత్నాల రాసులు విరాజిలిన విపణిలో
పసిడి పసికందు లమ్మకము సాగినదిపుడు!

చిగురాకు కనులెత్తి కల కలా నవ్వ—భూ
జములు మనుజుల పచ్చనైన నెచ్చెలు లిపుడు—
హరిత కాంతుల వీడి, ఆకులను పోనాడి,
దిక్కులకు తమ దుఃఖగాధ వినిపిస్తాయి!

శూన్య దిగ్భిత్తికల కనులతో గ్రోలుతూ,
దైన్యాల నెమరేసి నిలువు కాళ్లంబడుతు,
నిముషాల యానాల బ్రతుకు పసరాలనే—
తమరైతు యజమాని చంపి తింటున్నాడు!

చేయ పనిలేకుండ చేత పైసా లేక—
బాలింత యిల్లాలి ఆకలార్పగ లేక—
తోటివారల కరుణ నర్థించి వెదుకుతూ
వెతల బ్రతుకీడ్చి వెనుతిరుగు యువకుండతడు!

శుష్క వదనాలతో, శూన్య హస్తాలతో,
నకనకా మండు యెండల మాడి వేసారి,
పట్టెడన్నము కొరకె, గుక్కెడు జలానికే—
జవరాళ్ల మానాలు అంగళ్ళ పాలాయె!

కాలూరు ఎలమరుస్త్రి వస్త్రాపహారణాల
పాత పాపాల నివృత్తికై కాటోలు....
జనుల శ్రీమఫలితాల సైతాను ప్రముఖ
కాంగ్రెసు గ్రేసుగా వస్త్రదానముచేసె !

ఆనాడు కానలకు పాలయిన రాఘవుడె—
ఈనాటి నల్ల కళ్ళద్దాల నాయకుడు !
అవతార పురుషుడే మసిపాలబడ్డాడు—
లేదింక లోటంచు రాబందులంటాయి !

అశ్వరథశరథయని అల్లల్లపీరయని
ఆ రాఘవుడు వెడలె గ్రామగ్రామానికీ !
కాకమ్మ కథలతో రుచుపు బాపుటకాలకు
నక్కజిత్తులమూట విప్పాడు నేర్పుతో !

ఆనాటి రాఘవుని బలగాలు భక్తిగా
సాగరోద్ధతిని ఖండించి వారధి కట్టి ...
ఈనాటి రాఘవుని సైన్యాలు శక్తితో
తిమ్మయ్యపై భగీరథులుగా మారారు !

దండకారణ్యాలు క్షుద్దవానలముతో....
సుందర వనాలు కాటక భీకరాలతో....
గృధ్రజంబుక ఘూక పైశాచ గణముతో....
నేటి నవభారతము ఘోషించు పెన్నాళ్లో ?

# క్షామగీత

విలువుకోరా — తెలుగు
వెలుగు నేలను నేడు !
గెలుచుకోరా కరువు
బరువు ముంచిన కీడు !

రాయలకు సీమగా — రతనాల సీమగా—
పేరు మోసిందిరా తెలుగు మొగసాలలో !

అమృతాంధసు లాంధ్రు
లన్నారు మున్నెపుడో—
ఈనాడు మననాదు
కేలరా శనికీడు ?

మన నదుల యెదలలో క్షీర ముందన్నారు.
ఏదిరా మననోట పట్టెడన్నపు కరడు ?

పుడమి బిడ్డల బ్రతుకు
గడచె వెదుకుచు మెతుకు;
మనిషి మోపిన కరువు—
మునిషి చూపునె తెరువు ?

సన్యాసివై పరీక్షిస్తావు దేనికై ....!
అన్వేషివై నిరీక్షిస్తావు దేనికై ....?

మనిషి మోపిన కరువు—
మునిషి చూపునె తెరువు ?
మునిషి మోపిన కరువు—
మనిషి చూపును తెరువు !

నిలుపుకోరా-తెలుగు వెలుగు నేలను నేడు !
గెలుచుకోరా-కరువు బరువు ముంచిన కీడు !

పేరిన నిరాశలే
ఇరుల దొంతరలుగా—
లేమియిడుమల కడలి
కెరటమై తరుమగా—

గమ్యమెరుగని జీవయాత్రలో....
జనసమూహపు పెదలమోత్రతలో....
క్షామపీడిత మహాభయదాగ్ని జ్వాలలో....
మనుగడకె నోచుకోలేదా ??      మనుగడకె॥

వంగభూమిని క్షామ
రాక్షసికి బలిచేసి,
వేవెలాదులు మహా
ఘనత కెక్కిరినాడు !

ఆనాడు ఆంధ్రుల ప్రశస్తి చాటావురా !
దేశాన త్యాగధనులాంధ్రు లనిపించావు.

తెలుపు రేకుల పుడమి
కరువు బాకుల కదరి
నిలువ లేకున్నాదిరా!
నిలుపుకొని కాపాడరా!

రాళ్లపాలై మసలుచేలరా మనిషీ—
చోళ్లజావకు కొసరుచేలరా మునిషీ?

చావుబ్రతుకుల నడుమ
జీవించుతున్నాము;
చావుపై కసిపూని—
గర్జించు తున్నాము;

చీలుబాటల నిలచి బెదరుతావేలరా?
బాటసారీ గమ్యమిక బారెడేరా!

నీగుండె చెరువులో
నిండెను దరిద్రాలు—
నీలోని ఆకలికి
పొంగెను సముద్రాలు!

నీపంచభక్ష్యాల నిలువునా కాజేసి
నిలచి నీకరువులను తిలకించి పరిహసించు
నీశత్రువెవ్వరో పసిగట్టరా....!
నీమిత్రులతొచేరి కసిబట్టరా!

నిలుపుకోరా–తెలుగు
వెలుగు నేలమనేడు!
గెలుచుకోరా–కరువు
బరువు ముంచినకీడు!

# జానపదం

మరువలేమిక-మరువలేమన్నా ! ఈదుష్టపాలన
మిడిన యిడుమల తరతరాలకు మరువలేమన్నా !!

రావణుండో, కీచకుండో, దుర్యోధన చక్రివర్తో—
మారీచుడా, బకాసురుడో, భస్మాసురులకబంధాదులో—
ఎంతక్రూరాత్ములేకానీ సలుపనేరని ఘోరనేరము,
జరిపిరీముష్కరులు నిన్న నే-నిరాయుధులగు జనులపై బడి;
మరువలేమిక మరువలేమన్నా !!

ఇనుప మడమల కర్కశాత్ములు తెలుగుపడతుల పట్టిఈడ్చుచు
పట్టపగలే నట్టనడవల పదుగురేవురు ఎట్ట ఎదుటనె—
గవిసి బట్టలనూడ్చి రాక్షసరతుల మానాల్ భంగపరచిరి,
తెనుగు పుడమిని పల్లెపల్లెకు ఒకే కథగా వధల నింపిరి,
తరతరాలకు మరువలేమన్నా !!

కష్టజీవుల ముష్టిబ్రతుకుల కలత వెతలను కడుగనెంచిన,
నరుల మూపులనున్న కాడిని దించి బరువుల తుడువచూచిన,
ప్రజావీరుల పట్టి చెట్లకు కట్టి కాల్చిన రక్కసులతో—
చిత్రహింసల జంతునీతికి బలులనిచ్చిన కర్కశులతో—

ఎట్లు నెయ్యము నెరపగలమన్నా !—మన తెనుగు
గుండెల పాతగాయాల్ మానుపెట్లన్నా !!

కాలూరెలమర్రు కణలూర్—మోరి మురమందేశఘాటిగ.
ఒకేకోడన రమణగిరికి వివిధ పథాలగుండ ప్రోగగ,
పల్లెపట్టులు గుండుదూసిన గుండెతూట్లతో నిండిపోయెను,
గడపగడపల నొతేషటము ‘ఆత్మబంధువు’ వోలె మారెను;
మరుపలేమిక మరువలేమన్నా !

పన్నుపెరుగగ బ్రతుకు టలరులు మన్నుపాలై పండుచుండగ.
వెన్నువిరిగిన బ్రతుకుతలపులు ధూళిపాలై సూల్గుచుండగ,
పోలీసు లాఠీ తుపాకీలే జనులపై సవ్వారిచేయగ....
క్రూరమృగములు నోరుతెరచుక కుటుంబాలను మ్రింగుచుండగ.

ఈ దుష్టపాలన మెన్నిజన్మల కైనగానీ—
ఏవిధముగా మరువగలమన్నా ! !

ఊరినడుమకు జనులనందరి చేర్చినారట మహాదుష్టులు,
ఆడుమగ పసివారలనియెడి భేదములు విడనాడి నీచులు,
వలువలూడ్చి దిగంబరప్రజ వీధివీధికి త్రిప్పిచూపుచు—
గాంధిదేవుని రాతిగుండెకు మ్రొక్కలిడుడని చావమోదిరి;
ఈ విషాదము మరువలేమన్నా ! !

అయ్యయో ఈఘోరమేమని అడుగ తలలను త్రుంచివేసిరి,
కలముగానీ కుంచెగానీ కదుల సంకెల గలగలన్నది,
బందిఖానా భరతభూమి ‘స్వరాజ్య’ మంటూ ఫిలువదొడగిరి,

ప్రాణమున్న కళేబరాలను చీల్చి తిను రాబందులాయిరి;
ఈ విపత్తును మరువలేమన్నా !!

తెలుగుజనులకు జన్మహక్కు, స్వరాజ్యవాంఛకు మూలబీజము-
కలకాల వాంఛిత మగుచు నరులకు ఊపిరై పెరిగిందికాదా—
అట్టి ఆంధ్రరాష్ట్రవాంఛను బుట్టదాఖలు చేసినారే,
ఏమిటీఘోరమని అడిగిన స్వామినే పొమ్మనిరి కాదా—
ఈ కౌరవేయుల మరచి పోగలమా !!

సత్యాగ్రహమ్మే మార్గమనుకొని అన్నమూ నీరైనముట్టక,
ఆంధ్రరాష్ట్ర మ్మివ్వకుంటే అసువులిచ్చే నిశ్చయంతో—
అంపశయ్యలనున్న సీతారాములను రక్షించుకోవలె
నయ్యేయో, తెలుగన్నలంతా ఐక్యమై వురకాలి ముందుకు;

రాయబారా లేలనోయన్నా !, ఈ రాచపుండుకు
శస్త్రమే దివ్యౌషధమురన్నా !!



# జ్వాలలు - మాలలు

అనగనగా ఒక్క నక్క ఉన్నదిచూడు !
అదే ప్రజల భుజాలపై కెక్కేను నేడు !

అల్లదిగో గుంటనక్క అరుస్తోందిరా,
ఎల్లలోక జనులవీపు కరుస్తోందిరా,

పాటవంక చూపినక్క మాయవన్నగా—
కాకిబావ నోటినుంచి ముక్కజారగా—

గుంటనక్క గంటకొట్టి ఉడాయించెరా !
పంటపొలా లాక్రమించి చెలాయించెరా !

జనతపైన సమరం ప్రకటించిందండోయ్ !
మరి చూస్తూవూరుకుంటే ముప్పేనండోయ్ !

చాంకేషేక్ హిట్లర్లూ మడిశారండోయ్ !
కానీ మననక్కగారు మరిచారండోయ్ !!

* * *

తన దొంగల ముఠాతోటి అలీబాబా—
తంత్రంతో చొరబడెనట కోట గబగబా !

సత్యాహింసల మంత్రం పలికినంతనే—
'ఖోలో దర్వాజా' అని పిలిచినంతనే—

కోటతలుపు సులువుగాను తెరిచారంటా !
చేతికర్ర లఘువుగాను నడిచారంటా !

ప్రాణాలరచేతబట్టి నరులు కుందగా—
ఆకలి పడగాడ్పులోకి బ్రతుకుపెండగా—

చేతులెత్తి దేవదేవు ప్రార్థన సలుపా,
ఆశలన్ని తీయనెను ఆలీబాబా !

జిహ్వాకు సరిపడిన సయాటగా మతాబా—
వహ్వా! వెలిగించుకొనెను అలీబాబా !!

* * *

దుర్జన సభ దుశ్శాసను లధిష్టించగా—
ప్రజల కిష్టమువని శకుని కొలువు నుండగా—

ధర్మతనయుడైన నరుల విసర్జించిరే !
ధృతరాష్ట్రశ్రీప్రభువులు ఆగ్రహించిరే !

శకుని కినుక ఉక్కుతునక ద్రక్కిపోసెనే !
నరకేసరిశర్మయ్యై జూలుదులిపెనే !

జనుల బ్రతుకు ఖజానాల దోచి వెంటనే—
వనితగతి బజారుకెక్క చూచి కంటనే—

ఈ ఘోరం చూసి పొలం తలలు వంచెనే !
ఈ ద్రోహం చూసి సుమం కనులు మూసెనే !

పౌరుషాగ్ని ప్రజాహృదిని ప్రజ్వలించెనే !
బాడబాగ్ని మదరాసున రేవు చేరెనే !!

*　　　*　　　*

ప్రజలకోస మీపాటను వ్రాశానండోయ్,
ప్రజాగళము నీమాలను వేశానండోయ్,
గుండెగుండె కీజ్వాలను వెలిగించండోయ్ !
కుతంత్రాల పగటిపైన పగవూనండోయ్ !!



# ఆంధ్రజ్వాల

ఆంధ్రులము గొంతెత్తి కోరాలోయ్!
**విశాలాంధ్రమును** మనము కావాలోయ్!

పీయూషలహరులై పొంగు మన నదులన్ని—
ఉప్పునీటి సముద్రగర్భాన కలిశాయి;
కనకరాసుల గన్న గనులన్ని మనకెపుడు
కలలోని కోటలై చెదిరి పోతున్నాయి!

గోదావరీ తల్లి పొత్తిళ్ళలో పెరిగి—
ఆసేతు హిమనగాంతర్జనుల యెదరేలి
విజ్ఞాన జగమునకు నాథుడై వెలిశాడు—
అట్టిసి తెలుగులను భారతము మరచింది!

పచ్చపచ్చని మిసిమి తరుణ జీవితమంత
పెరవాడి పూడిగము చేసి శుష్కించింది;
తాళ్ళబందాలేసి కడుపులో చిచ్చెట్టి
ఊళ్ళనన్ని వల్లకాడుగా మార్చారు.

ఏడిరా త్యాగయ్య—తంజవూరెళ్లాడు;
ఏడి నాగార్జునుడు—మద్రాసు తరలాడు;
ఏది నీ కొహినూరు—లండనే వెడలింది;
పిబ్రితుకు రతనాలు—కగ్గిపోతున్నాయి!

తెలుగు గుండెలబ్రతికె పలికిన కవీశ్వరుడు—
శ్రీనాథు పలనాడు కరువుతో మడిశాడు;
ఆనాటినుంచి మనబ్రతుకొకేరీతిగా
సాగుచున్నది మహాక్షామాగ్నికెరయగుచు !

అదిగో గంజాములో తెలుగు తమ్ముల ఘోష—
ఇదిగో రాయలసీమ క్షామాగ్ని ఫెళఫెళలు—
అదిగో తెలంగాణ గాజుముక్కల గాథ—
ముక్కోటి మనజాతిదేదిరా ఘనకీర్తి ?

రామపదసాగరము పత్రాలమిగిలింది,
సిద్ధేశ్వరము, నందికొండ, గొంతునమిగెనె,
కృష్ణవేణీ సరిత్తుంగభద్రల నేడు—
తమిళ కుత్సితమతులు కబళించనున్నారు !

రాష్ట్రమేలేకున్న ఆంధ్రజీవితమింక—
మరణశయ్యగ మారి ఆశ నశియిస్తుంది;
తరుణమిది స్వేచ్ఛకై పోరాటమార్గాన—
సాగి చావో రేవో తేల్చండి ఏకమై !

గుండెగుండెకు పౌరుషాగ్ని వెలిగించగా—
గడప గడపల నాంధ్రజ్వాల కీలించగా—
ఆంధ్రులము గొంతెత్తి కోరాలోయ్ !
విశాలాంధ్రము మనకు రావాలోయ్ !!





## ప్రతిజ్ఞ....

ఆంధ్రదేశము మనది
ఆంధ్రరాజ్యము మనది
ఎవడడ్డు వచ్చినా—
చెండి పారేద్దాము.

ముక్కోటిమందిమీ
ఒక్కటై నిలచితే
ఎవ్వడెదిరించినా
దుల్లగా నేలపడు.

అంధుడు కబంధుడై
బాహువులు సాచితే
ఆంధ్రులము శ్రీరామ—
లక్ష్మణుల మౌదాము.

నైజాముకీ, వాడి
నైతాన్లకీ, నేటి
గుజరాత్ విధాతలకు
తమిళ ధనస్వాములకు
తెలుగు తల్లిని చెరచు
ప్రత్యర్థులందరికి
ఖబడ్దారని కంఠ
మెత్తి ఘోషిద్దాము.

శతృవెవ్వడు కాని
మృత్యువిక తధ్యమని
కసితోడ గొంతెత్తి
హెచ్చరిక చేదాము!

జనవాణి వాణ్ణింగుప
తుదిసారి చెబుదాము:
తుదిసారి జనశక్తి—
మహిమ చూపిద్దాము.

ఇదె పిలుస్తున్నాను—
రండి ఆంధ్రుల్లారా!
తక్షణం రారండి—
విరూపాక్షుల్లార!

పరుగు పరుగున రండి
పరశురాముల్లార!
ఉరకలిడి రండిరా
గరళ కంఠుల్లార!

ఇదె పిలుస్తున్నాను
ఎదలో ధరించండి
అనికి పరుగున రండి
అఖిలాంధ్ర జనులార!

ఆంధ్రరాష్ట్రముతోటి
శాంతిమయ సౌఖ్యమయ
ప్రజాస్వామ్యము ఒకే
సారి స్థాపిద్దాము !



# సవితాకిరణం ..

నా తల్లీ, ఓ సూర్యాపేట !

ఆనాడే, ఐదారేడుల క్రిందట—
నీలో వెల్లివిరిసి పెల్లుబికినదట—
ఆంధ్రజాతి విప్లవ ప్రాదుర్భావం !
కొమరయ్యగ వికసించిన జనతా హృదయాబ్జం !

ఓ సూర్యముఖీ, జనయిత్రీ !

ఆనాడే — అస్మదమల హృదయంలో—
కురిపించితి వమృతకవితామరందమో,
విరచించితి నవజీవన విధాత తరంగమో,
ఆనాడే — నీకభయం ప్రతిధ్వనించానో !

నాతల్లీ, ఓ సూర్యాపేట !

కానీ, నీలోపలి సస్యశ్యామల హృదయం—
నాకేసిందా బొంతపురుగుశాపం ?
నీ నాడుల పొంగే అరుణారుణ రక్తం—
తాగేసిందా వంతకరువు పాపం !

మజ్జననీ, సవితానగరీ !

ఆంధ్ర సంక్షోభ విప్లవాయత్తమూర్తి !
చిత్త సౌభాగ్య సౌందర్య చిత్రకాంతి ! !

చైత్రరథ శర్వరీ గంధసారగంధి!!!
అల్పజనలోక సంకల్ప కల్పవల్లి!!!!

ఓహో నా సూర్యపేట తల్లీ!
నిశాధ్వాంత గహనమునకు
పరశువువో సవితా!
నిశాచరోన్మాదోద్యమ
ప్రతీఘాతివో సరితా!

ఓహో ఆశాపేశలవల్లీ!
ప్రజాశత్రుపు లెదద క్రిక్కదలినుక్కణగ
పాంచజన్యంబు పూరించితే సవితా!
నిజాం రక్కసిమూక ఉక్కుదంతాలూడ్చ
బలదర్ప భంజనము చేసితే సమతా!

ఓహో చైతన్య లక్ష్మీపురంధ్రి!
ఆంధ్ర స్వేదార్ణవోన్మీలితాంతరంగ!
సకలమానవ కళ్యాణ జన్మనిలయ!!
తెలుగు మొగసాల విప్లవోత్తేజధ్వజమ!
సర్వలోకైక హితకార సాధుహృదయ!!

అహో విశ్వహిత ప్రవర్తకా!
సూర్యపేట లోకమిత్ర శూరవర్యస్థానమా!
రాక్షసోకృమత్తభంగ రాజితాస్త్ర ఖడ్గమా!

మానవ ప్రభావ జన్యమాధురీ విభాతమా !
చాలుచాలు క్షామసుప్తి శాంతితో సుఖించుమా !
ఓ నా తల్లీ, సూర్యముఖీ !
వీరుల కదలించితివా ?
వీరుల కని పెంచినావ, సూర్యనగరమా ?
వారధివలె పెల్లుబుకుచు
భారమ్ముల దింపినావె భారతమణివై ?
ఓ జనయిత్రీ, కోటి సూర్యప్రభా !
నీ దారిలో గరిక తలలపై మురిసేటి
పాలక ధ్వాంతౌఘప్రాలేయ బిందువుల—
మస్తక పరంపరల విధ్వంసనక్రియా
క్రతువొనర్చిన వీరమాతవే సవితా !
నా తల్లీ, సవితృనగరీ !
పాపమునిండిన బండిని
ఆపుటకై తీవ్రయత్నములవర్చి తుదిన్
దీపము వెలిగించితివే,
కోపములురలించు నెదల క్రొన్నెత్తుటితో !
ఓ శ్రమజీవుల హృన్మరందమా !
కశ్మలాల కల్మషాల కాల్చి సౌరభాలతో
యుష్మదీయ బాహుశక్తి యుద్ధరించు నీభువిన్
అందుచే పదేపదే సుమాంజలుల్ ఘటించెదన్—
సూర్యపేటతల్లిరో, విశుద్ధమానసమ్ముతో !





## ధరిత్రీగీతం....

దేశమంతామనది — ధరణియంతా మనది
మనము ధరణీమాత పసిబిడ్డలంకదా!
నవజగతినేడె స్థాపించగా రండిరా!
నవజనతనేడె సృష్టించగా రండిరా!

శతదివమ్ములు నేటి పుడమి కరుదెంచాలి,
దినరాజు కిరణాలు పసిడి కురిపించాలి,
శ్రామికుల శోకకూపాల, సంసారాల
పరిసరాలకు జీవశోభ వికసించాలి,
దినదినము మనము క్రొంగ్రొత్త శక్తులకూర్చి
నవమానవుల భవము జగతి విరచించాలి!

సకలలోకము సుఖస్వప్నాల తేలగా,
మానవ పరిశ్రమల సంగీత మమరగా,
నూత్న చైతన్యమూ, నవధర్మ సూత్రమూ
మనకు నూతనకాంతు లీనుజ్యోతిగమార
ఈజగతిలో నూత్న పథము శోధిద్దాము!
ఈజగతిపై నూత్న జాతి సృష్టిద్దాము!

నరులందరిని మనము ఏక మొనరించగా
విశ్వ మందంతటను ప్రేమ కాంతుల జల్లి,
సామ్య జగతిని నవ్యసభ్యతల నెలకొల్పి,
బంధన విముక్తితో బానిసలు పొంగగా,
నరుల శిరములు స్వేచ్ఛ గర్వోన్నతుల తేల్చి
పుడమిపై నవనరుల వరుస సృష్టిద్దాము!



## నికషోపలమ్....

ఓహో! శిరచ్ఛేదమై మిగిలిన స్వరాజ్యమా!
శుభదినాల భవితవ్యం కోసం,
గతకాలపు చీకటిలో పోరాడిన—
మరణించిన మాతండ్రుల వీరుల హృదయం
నేటికినీ రణదుందుభిగా
ప్రతి ధ్వనిస్తున్నది, నీ యాభిద్రిత విజయం.

ఓహో! శిరచ్ఛేదమై నిలచిన స్వరాజ్యమా!
జరాసంధ జాతకాన జనియించిన స్వతంత్రమా!!
నీరథోత్సవం నాటి వూరేగింపున—
సర్దుకొనిరి సాధికార పిపాసువులు ద్రోహులు,
జనవీరుల శిరాలు నరికిన విద్రోహులు!
నీరాజ్యాభిషేక విజయోత్సవ నామంతో
నీశిరాన మాయల కంటక కిరీటాన్ని
కీలించారే ముగ్ధసతీ — స్వరాజ్యమా!

జనవీరుల హృదయ కుసుమ
మకరందం గ్రోలి సోలి మత్తిల్లిన దేవీ!
ఆ కాలంలో విరిసిన సుహాసములవేవీ?
మా నేతలు, తాతలు, త్రాతలు—
అర్పించిన అశ్రువులే రత్నమాలలై

నీ కంఠసీమ నలంకరించి మెరుస్తుండగా,
ఈ ద్రోహులు మోసంతో చేసిన నత్త్తగుల్ల
దండలు నీ గళాన వేస్తూండగ,
అయ్యో – పాపం – స్వరాజ్యమా, శూన్యంగా
దిక్కులు చూస్తావేలా, బేలవగుచు ?

ఓ భారత జనయిత్రీ, ధాత్రీ !
సస్యశ్యామల సుగంధగాత్రీ !
నీతనయుల మిదిగో గుండెల–
కాహళి వినిపిస్తున్నామమ్మా :
ఇక మా ఓరిమి సన్నగిలింది !
మా హృదయాల నావరించింది–
ఏదో మాకేతెలీని వినూత్న తేజం !

అనేక 'వర్షాల' జలరాసులతో
ఉప్పొంగిన, నినదించిన ప్రజావాణి
నీ ఆలయ వాతాయనమైనా చేరలేదుకాదే;
ద్రోహులతో, జనశత్రు సమూహంతో
రాజీపడిన నీ ఆలయం బధిరమయ్యే కాదే;
నరుని గుండె చిదుకకొట్టి
జనుల కడుపు చిచ్చుపెట్టి–
నీఆలయ ద్వారములను మూసిరికాదే;
నాటి నీపూరేగింపు టుత్సవాల

మహాఖ్యాతి గరళంవలె ప్రవహించెనుకాదే;
నీదేవాలయ పూజార్లు—
జారులుగా జాలరులుగ చోరులుగా మారిరికాదే;
తామెక్కిన, పయనించిన, విపత్తులను కడతేర్చిన
వాగ్దానపు నౌకలనన్ని ఛేదించిరికాదే;
జాగృత మానవ విప్లవజ్వాలలపై
విషములుమిసి వికృతహాసం చేసిరికాదే;
పాతచరిత స్థంభాలకు—
బూజెక్కిన చక్రాలకు—
పసికందుల గుండెలనే బలిచేసిరికాదే;
ప్రతిచోటా అసంతృప్తి—
ప్రతిచోటా పతితకీర్తి—
ఊరూరా యింటింటా నెలకొల్పిరికాదే;
అయితే—సెలవిమ్మా, అమ్మా, స్వరాజ్యమా!
ఈబందిపోటు దొంగల—
ఈపందికొక్కు, కొంగల—
లాఠీతుపాకి ఫిరంగి బాష్పవాయువులు
పరిపాలించే దొరతనాల చీకటి ఊరేగింపులు—
సాగెదెన్నాళ్లింకా ?

ప్రతినిముషం ఓడలు హార్బరులో
ఆయుధాల దిగుమతి చేస్తున్నాయికదా!

అసంతృప్త మానవాళి జరిపే—
అన్నార్తుల హాహారవములు నింపే—
ఆందోళన — మూసగొన్న దారులపై
అడవిపందు లాఘునిహాయుధాలు
ఘీంకారం చేస్తున్నాయికదా !
కానీ ఆయుధాల పసిఘట్టిన
మానవులను బానిసలుగ మార్చలేదుకాదే;
అణువు విరిగి ప్రళయమైననూ—
ఇటులు మురిసి హత్య సరిసినప్పటికీ—
మనుజుల్లు వీరులుగా మారక మానరుకాదే;
అంటాతే — సెలవిమ్మా, అమ్మా, స్వరాజ్యమా !
ఈ మోసం మారణ హోమం
సాగేదెన్నాళ్ళింకా ?
ఆయుధాగారాల సోపానాలపై
అధికారం ఎంత ఎత్తు కెదిగినా
క్రౌర్యం భస్మమై తీరుతుంది కాదే !

చెట్లులేని బోడికొండ గుండెలపై
చీకటి నల్లటి దుప్పటి కప్పిన రాతిరి
వెలిగి వెలిగి మెరిసి కురిసి కరిగే
నిద్రలేని ఆకలి కన్నుల ఆశలు—
మెరిసి మెరిసి వెలిగి వెలిగి
చీకటిలో కరిగే మిణుగురులై

అనంతయానం చేస్తూనేవున్నవి కాదే !
నీరంధ్రంగా నీహారం కురిసినంత మాత్రంలో
మిణుగురు మూకల వెలుగును ఆర్పలేదుకాదే !
హేమంత నిశీధాలెన్నయినా రానీ—
ఇదిమాత్రం నిజమమ్మా స్వరాజ్యమా !
మిణుగురు కాంతులు మాత్రం నశించవమ్మా !
పైగా ద్విగుణీకృత వుత్సాహంతో ఉద్రేకిస్తూ
అనంతమగు పౌరుషాగ్ని కురిపిస్తూ — రొదచేస్తవి;
శత్రువులను ఉపేక్షించి ప్రగల్భించుతవి :

"ఓరీ జాన్‌బుల్, నీవాళ్ళంతా
కవాతులో — కదం కదమునను ఖతమై
పోతున్నారుకదా, మందబుద్ధివై
ఎందుకు నీ వృధా ప్రయాస !"

అని తమ శతృవులకు తుది హెచ్చరికలు
వినిపిస్తాయికదే స్వరాజ్యమా !
అంతేనా తదేకోదర — వృకోదరుల
నందరినీ హతమార్చే పర్యంతం,
ఈ మహాదీక్ష విరమించదు కాదే !
'జాక్‌బూట్ల' సహాయాన హుషారుగా
మసలే — 'అంకుల్‌శాము'ల నరభక్షక
బకస్వాములందరినీ భూస్థాపన మొనరించే

శుభోదయము వరకూ ఈ కృత్యము
విశ్రమించదమ్మా స్వరాజ్యమా !
ఏ భారములు తొలగునుతే తల్లీ,
ఓ భారత జనయిత్రీ ధాత్రీ !
సస్యశ్యామల సుగంధగాత్రీ !!



# ఉష్ట్రతాండవం

'అవ్వ కవ్వం త్రిప్పి అలసిపోయిన దంట !'
తాత ఏతామెత్తి సొమ్మసిలినాడంట !

ఎవరెస్టు శిఖరాద్రి
కెవ్వరెగ బ్రాకెదరు ?
'మధ్యధర' సాగరము
నీదనేర్చినదెవరు ?

ఉప్పునీళ్ళకు సైతమేర్పడెను లోటంట !
నిప్పుకోళ్ళ విహారనాట్య మమరినదంట !

పసిబిడ్డ పెదవులకు
పాలిచ్చు వారెవరు ?
ముసలివగ్గుల బ్రతుకు
పాలించు వారెవరు ?

నైజాము నైజమే పాలకాదర్శమట....!
స్వాతంత్ర్య భారతికి దుఃఖాశ్రుమాలలట !

ఆంధ్రబాధా సప్తశతిని
వినువారెవరు....?
ఆర్ద్ర హృదయాబ్జాల
విలువెంచు వారెవరు ?

దక్షిణాపథ జనుల కాప్తమగు జవహారి—
పీఠభూమిని భాగ్యనగరు నుంచి పరారి !

క్షామరాక్షసి మహో
బీభత్స పదయుగళి....
గృహ గృహాంగణ నాట్య
కేళీ విపద్రవళి....!

బ్రతుకుల యెడారిలో నర్తించు లొటిపిటా—
లలిత హృత్పీఠపై నుత్తతాండవమకట !

భారతీయుల విషాద
గాథ నవరించగా....
కరువు కాటక కీడు
లంత మొనరించగా....



ప్రజాజీవిత పెజెండాలో చేర్చలేదా ఎర్రజెండా ?
స్వజాతీయ సహోదరులలో కూర్చలేదా మహాజ్వాలా ?
అంతలోనే బ్రతుకు భారం—
తొలగిపోవుట న్యాయమా మరి !
"అందుకే ఘనమైన దస్త్రం—
పంచవర్ష ప్రణాళికిదిగో !!"

తెలుగులకు దసరాల సరదా దేవినవరాత్ర్యుత్సవములకు
సఫలతను చేకూర్చుటకు వేంచేసె శ్రీనెహ్రూ !

కరువు పుర్రెలమాల గ్రుచ్చుక—
కంఠసీమ నలంకరించుక—
కాళికా తాండవము సేయగ—
వచ్చె శ్రీ నెహ్రూ....!

ఇంతకీ కథ యేమిటనగా - పాల కడవ ఫడేలుమన్నది !
ఇంతకీ మన నూతిలో ఏతాముదిగినా నీరు తగలదు !!

  

# శ్రీరామరక్ష

హర్తాల్ హర్తాల్ హర్తాల్ !
నేదేసు నేదేను నేదేసు హర్తాల్—
నేడే హర్తాల్ — నేడే హర్తాల్—
హర్తాల్ హర్తాల్ హర్తాల్ !!

నేడాంధ్ర వినువీధి నొక్కాటే ఘంటగా—
నేడాంధ్రజనహృదయ మొక్కాటే మంటగా—
నేడాంధ్ర దీక్షాజయశ్రీ రవమ్మగా—
నేడాంధ్ర పౌరుషము వీతహోత్రమ్మగా—

హర్తాల్ హర్తాల్ హర్తాల్ !
గుండె గుండెకు తోరణమ్మిదే హర్తాల్—
పచ్చ పచ్చని యువ్వనోద్వేగి హర్తాల్—
హర్తాల్ హర్తాల్ హర్తాల్ !!

నేడే వియత్‌వీధి మ్రోగెను నగారా—
నేడే విజయ్‌వీధి వెలిగింది జ్వాలా—
నేడే జనం ఘనాఘనముగా మెరవా—
నేడే విశాలాంధ్ర జయభేరి మొరవా—

హర్తాల్ హర్తాల్ హర్తాల్ !
ధూర్తులకు ప్రాణ ప్రమాదకర హర్తాల్—

ఆర్తులకు జీవ సంజీవనీ హర్తాళ్—
హర్తాళ్ హర్తాళ్ హర్తాళ్ !!

యువకులంతా కలసి తాగ్రిడుగా,
ప్రౌఢులంతా పెనగి మోకుగా,
ఇల్లిల్లు మొరసినది ఒక్క గొంతుకగా,
ఊరూరు మొరసినది నవ్యతేజముగా.

హర్తాళ్ హర్తాళ్ హర్తాళ్ !
జనహృదయ సంసేవ్యమానమీ హర్తాళ్—
ఘనరోచిరోజ్వల విభాతమీ హర్తాళ్—
హర్తాళ్ హర్తాళ్ హర్తాళ్ !!

పేటపేటా కదలిరాగా ....
కొట్టుకొట్టూ బందుకాగా ....
మిల్లుమిల్లూ మూతపడగా ....
ఇల్లుల్లూ లేచిరాగా ....

హర్తాళ్ హర్తాళ్ హర్తాళ్ !
నేటికి సమైక్య జనకృత్యమీ హర్తాళ్—
నేటికి సజీవహృత్జన్యమీ హర్తాళ్—
హర్తాళ్ హర్తాళ్ హర్తాళ్ !!

పొట్టివాడే నేడు పొడుగాటి బలగాన్ని
గట్టిగా కదలించి త్రివిక్రముండైనాడు.

కనుకనే ఆంధ్రుల సువాంఛ కెపదడ్డయిన
బలిచక్రవర్తి వలె పాతాళమునకణగు—

నేడే శుభోదయము కలిగించె జనతా—
నేడే విసూత్న్నదశ తెరిపించె హర్తాల్ !
నేడే స్వరాష్ట్రోద్యమము విలంఘించా—
నేడే ఫణీంద్రమై కదిలింది హర్తాల్ ! !

నందికొండకు, జలోత్సవము జరిపించగా—
సిద్ధేశ్వరుశిరాన గంగ నిలుపంగా—
రామపదసాగరోదక కేళి కులుకగా—
ఆంధ్రమాత గృహాంగణము సుఖాల్ వేలగా—

హర్తాల్ హర్తాల్ హర్తాల్ !
ఇది ఎల్లి ఎర్రపూల్ విరియించు హర్తాల్—
ఇది నేటి మల్లెపూల్ తురిమించు హర్తాల్—
హర్తాల్ హర్తాల్ హర్తాల్ !!

కరువులూ కాటకాల్ పండు భూతలముగా,
పెనువిషూచీ మసూచీ జాడ్యముల్ పెరుగ,
ప్రత్యంగుళ స్థలము వూసరక్షేత్రముగ,
జీవనాడులు తునాతునకలుగ త్రెంపగా,

ఆంధ్రదేశము ఖేదమవతారమైనదే—
ఆంధ్రభారతి విషాత రూపమైయున్నదే—

అందుకే సర్వజన హృదయ మీ హర్తాల్ !
అందుకే భావి భాగ్యోదయము హర్తాల్ !!

ప్రతిపాఠశాల విద్యార్థులూ వీరులై,
ప్రతి ఫ్యాక్టరీలోని కార్మికులు శూరులై,
ప్రతి కర్మక్షేత్రాన హాలికులు యోధులై,
మన విశాలాంధ్రయే విశ్వరూపమ్మవగ—

కదలాలి కదలాలి కదలాలి హర్తాల్ !
అందరూ ఒక్కటై కదలాలి హర్తాల్ !!
ఆంధ్రభూమికే 'విజయ' మాదర్శమై వెలుగ
పుష్టిగా తుష్టిగా నిలుపాలి హర్తాల్ !!!

జనులందరూ రండి, కవులందరూ రండి,
కనుతెరచి చూడండి, మంచితరుణముసుండి,
రైతులూ కార్మికులు గాయకులు రారండి,
మస్తులు గుమాస్తాలు వస్తాదులై రండి !

తెలుగు తల్లికి కనులపండువీ హర్తాల్ !
తెలుగు కన్నుల వెన్నెలమరించు హర్తాల్ !
ఆంధ్రత్వ మీనాడు మెరపించు హర్తాల్ !
ఆంధ్రజాతికి శోభలొనగూర్చు హర్తాల్ !

హర్తాల్ హర్తాల్ హర్తాల్ !
నేటినే కదిలించి మొలిపించు హర్తాల్ !
నేడేను నేడేను నేడేను హర్తాల్ !
హర్తాల్ హర్తాల్ హర్తాల్ !!

## తెలుగు తొలకరి ...

తొలిచూలు నింగిలో తొలకరించిన మెరుపు
తెరతీసి చూపించి — కండనెత్తుటి యెరుపు

ఆంధ్రరాష్ట్ర సువాంఛ,
స్వేచ్ఛా పతాకమై

తెలుగు దివిగుండెలో వెలిగిందిరా !
తెలుగు పుడమికి ఒళ్లు పులకరించిందిరా !

తొలికారు చినుకులో రతనాలు జలజలా
పసిడి గడ్డపు మిసిమి ముత్యాలు మిలమిలా

రాసులై రాలుతూ
కనకాల సోలుతూ

తెలుగు జోదుల యెడద వెలిగిందిరా !
వెలుగు రేకుల పుడమి విరిసిందిరా !

రేయిలో తొలివాన వాగులో బుసబుసలు
ముసిరిన తుఫానులో యేరులో రుసరుసలు

పలకరించిన మొయిలు
పులకరించిన బయలు....

తెలుగు తల్లికి తలపులూగాయిరా !
వెలుగు వెల్లికి వలపులూరాయిరా !

ఏడాది కేడాది కెటు నడచి వచ్చినదో ?
ఏపురాచరితలను ఏరుకొని తెచ్చినదో ?

ఇపుడు స్వేచ్ఛాగీతి వెడలగా
ఇపుడు స్వచ్ఛ జ్యోత్స్న వెలుగగా

తెలుగు మొగసాలలో బ్రతుకు కదిలిందిరా !
ఆంధ్రవాహిని క్రొత్త తరగలెత్తిందిరా !

తెలుగు తల్లికై, తనువు పులకరించిందిరా
తెలుగు సీమకు వెలుగు తొలకరించిందిరా

నేడే నవజ్యోతి వెలుగగా
నేడే నవక్రాంతి మొలవగా

తెలుగు జోదుకు యెదలు జలదరించిందిరా
తెలుగు పుడమిని ఇరులు అంతరించాలిరా !



# సారంగ సందేశం

ఓ శాంతి సారంగమా !
ఓ శ్వేత సారంగమా !

ఉన్నతోన్నత గగన
వీధులకు పయనించి—
జగతి నలు దెసలలో
గల ప్రజాహితులతో....
దానవత్వపు బలిమి
మూలముల పెకలించి,
మానవత్వపు కలిమి
చెలిమితో మొలిపించి,
సంతసాలను తినుచు
సంబరాలను మనుచు
వలపు వంతెనలపై
పయనించు నరులతో....
తెలుపుమా సారంగమా !
ఓశాంతి సారంగమా !

తెలుగు పొలమున కలుపు
లేరి వేసితి మనుచు ;
తెలుగు పుడమిని వెలసె

సరదాల తోటలని....
చెదలేటి రసపూరు
పెలయేటి కెరటాల
తెలుగు వీరుల కతలు
పాటలై మొరసెనని ...
మా హృదంతర సుప్త
గాఢాంధ తిమిరాల
దూరాల కీనాడు
తరిమివేసితి మనుచు....

చెప్పుమా సారంగమా !
ఓశాంతి సారంగమా !!

వల్లినల్లని మలల
చెరియ లొరసిన మహా
గోదావరీ నదీ
అందాల నగిషీలు—
జిలుగుజిగి వొయ్యార
మొలికిన జిగీషలు—
చల్లచల్లని కళల
మందస్మిత ప్రభలు—
పాపికొండల నడుమ
డోలా తరంగాల

తెలుగు మలయా నిలవు
ఎడద కరగిన కలలు—

వర్ణించి పాడుమమ్మా !
ఓశాంతి సారంగమా !

గోస్తనీనది పాల
తొరకలవె తిరుగబడె....
శారదానది జ్ఞాన—
చంద్రికాంతుల బరపె....
అలనాటి దండకా
రణ్యాల నిస్తబ్ధ
శాఖాంతరాలలో
దాగిన నిశాచరులు
తునకలై ఒరుగగా—
ఆంధ్రిమాతకు నేడు
అరుణోదయమ్మాయె
నని త్వరగ తెలుపుమమ్మా !

పయిదాల పయనించుమా !
ఓ శాంతి సారంగమా !!



# క్షుభితపథయాత్రి

మెతుకు వెదకి సృక్కినాను,
బ్రతుకుతెరువు కానలేను;
బరువు మోయలేదు మేను,
కరువు చెరువుసీదలేను;

ఆశల తేనెల సోనలు
కారిచి పుప్పొడులరాల్చి,
రేకులూడ్చి తొడిమవీడి
నేలపడిన పూవు నేను.

వలపుటలరు చెలి వాతెర
చిరునగవుల సురభిళాల
కోరి మదోన్మత్త యాత్రి
సలుపు మధుపరాజు నేను.

కాంతహృదయ కాంతారపు
టల్లిబిల్లి చిక్కులలో
తలదూరిచి వెలికిరాక
తన్నుకునే దుప్పినేను.

నడివేసవి మధ్యాహ్నపు
టిసుకతిన్నె బయళులను — ని

దాఘతప్త శుష్క మరీ
చుల నెఱకే దప్పి నేను.

గరికచిగురు కొరకలేని
తల్లిలేని లేగదూడ
పసికన్నుల పాపరెత్తి
కురిపించే జాలి నేను.

పడి లేచే - విరిగిపడే
ఒడ్డులొరసి తలలు చెడే
అలసట నురగలు క్రక్కే
అలల కలల జలధి నేను.

పొన్నచెట్ల పొగడచెట్ల—
శాఖాచయముల ఛాయల—
నవల సువాసనలు చిలిపి
పసిపిల్లల ఆటలటుల!

భూరుహాల — కొమ్మల కుసు
మాల — చలువసీడల మెయి
సేదతీర్చు వలపుతావు
లెన్నిటికో రూపునేను

డేగ జటాయువు వాయుప
వ్యాఘ్రివ్యాళ క్షుద్రి వికృతి
పీడించే — పిల్చితినే
జీవ కళేబరంచేసెను.

సర్పి మొర్రి పీతలూత
ఈగ దోమ పక్షచిలుక
జెర్రి తేలు మండ్రిగబ్బ
తేలసిందె నామార్గము ?

పొలబారిన పులుసుముద్ద
గొంతుదిగక, ఊర్పులణగ,
కంఠ పరీవృతములగుచు
సరీసృపము లతిశయించ :

వెతలకతల కలతవూబి
పడిమునిగి కృశించలేక,
క్షుభిత పథాంతరయాత్రిసు
వడి నడిచే శక్తిలేక;

ఇంద్రజాల విశ్వసృష్టి
కాది యెపుడో అరయలేక
జీవపదార్థముల మూల
బీజములను వెదుకలేక;

వెటుకలేక, బ్రతుకలేక
అరయలేక - శక్తిలేక
క్షుభిత పథాంతర యాత్రల
శోషిల్లే వగ్గు నేను!

అయినా నానొసట వ్రేలు
ఘర్మవారి ఝరుల నడుమ
అంతరంగ జీవితేచ్ఛ
తేలిన మనుసిగ్గు నేను.

పరమాణువుకన్న యెడద
నిజం సుమా బహుస్వల్పం!
బ్రహ్మాండంకన్న హృదయ
మనవరతం మహత్తరం!

ప్రళయ హరుని విషమనేత్రి
జనితానల విషజ్వాల —
జగజ్జన సమాజ హృదయ
పరివర్తిత క్రాంతికీల —

అస్మదమల నిశితనేత్రి
యుగ్మము దర్శించు నూత్న
యుగోదయ శుభోత్సవమును
రాగరంజితమ్మొనర్చె!

అయినా నా మనోవీధి —
పరిక్లేశ లలితాకృతి
ఆక్రందన రోదనలు
నృత్త నృత్యకేళిసల్పు ?

తల్లీ ! పుడమీ, నా యెద
కేల యీ విషాదగాథ ?
తల్లీ ! పుడమీ, మదీయ
భాగ్యరేఖ లెచటగలవు ?

అమ్మా ! పృథివీ, నామది
కేల తెలుపుమీ వేదన ?
అమ్మా ! పృథివీ, నాబ్రతు
కెచ్చటికీ క్షుద్ధయాత్ర ?



# సాగర సంగీతం

కురవనీ, కురవనీ —
తొలకరి తొలివానజల్లు
పిలపిలా కురవనీ!
ముసరనీ, ముసరనీ —
చిలికిన విరిదేనెతేట
జలజలా ముసరనీ!
పొంగనీ, పొంగనీ —
మెరిసివరద ఉప్పెనతో
గంగనే పొంగనీ!
కృంగనీ, కృంగనీ —
సుమసౌరభ శుభోపేత
ధరాతలం కృంగనీ!

  

హో .... హే .... హో .... హే .... హో!
హే .... హో .... హే .... హో .... హే!
హో .... హో .... హో
హో .... హో హే!
హే .... హే .... హే .... హే .... హో!
హో .... హో .... హో .... హో .... హే!



మరగనీ, మరగనీ —
నిర్జీవుల నరాలలో
రుధిరజలం మరగనీ !
చిమ్మనీ, చిమ్మనీ —
హాళిక జనరింఛోళిని
హాలాహలం చిమ్మనీ !
గెలువనీ, గెలువనీ —
నిరుపేదలు, నిర్వాసులు,
నిర్భాగ్యులు, నిర్వీర్యులు
దుర్వార పరాక్రమమున
పృథ్వీస్థలి గెలువనీ !
పెరుగనీ, పెరుగనీ !
పురాజగస్సమాధిపై
నవ్యోదయ నవ్యోత్సవ
భవ్యజగం పెరుగనీ !
ఎదుగనీ, ఎదుగనీ —
జనహృదయ సరోవరాన
జ్ఞానపద్మమెదుగనీ !
వెలుగనీ, వెలుగనీ —
మానవ మానస వీధుల
కళాజ్యోతి వెలుగనీ !



హే .... హో .... హే హో .... హే !
హో .... హే .... హో .... హే .... హో !

హే ... హే ... హో !
హో ... హో ... హే !

హో .... హో .... హో .... హో .... హే !
హో .... హో .... హో .... హో .... హే



తొలకరి తొలివానచూసి
జడియనేల తమ్ముడా !
తడుపుననుచు తలామొలా
బిడియమేల తమ్ముడా !
వెడలుము తడవేలసేయ
జడివానలు కుమ్మరగా,
జడుపదేల వడివడి — కద
గండ్ల గడపదాటగా,
దాటగ వెడగొండనేల
నిదే నేటిబాటరా !
పాతమాట బూటకాల
కోటలు పడగొట్టగా;
ఘనాఘనం మెరియగా —
ఇలాతలం మురియగా,

వియత్తలం కురియగా —
హృదంతరం విరియగా,
కరువు బరువుటిరుసు విరిగి —
వెతలకతల కలత తరిగి —
సతుల సుతుల మతులు పెరిగి —
అతులిత సంతోషమొలికి —
సుఖస్ఫూర్తి వెలయగా,
మనసు మనసు కలియగా
తరతరాల నిరీక్షణకు
తరుణమరుగుదెంచెనింక
వెరవనేల తమ్ముడా!
తొలకరి జడివాననేడు
జగతిలోని కలతకడిగి
వెలుగులీను తమ్ముడా!



హో .... హే .... హో .... హే .... హో!
హే .... హో .... హే .... హో .... హే!
హో .... హో .... హే!
హే .... హే .... హో!
హే .... హే .... హే .... హే .... హో!
హో .... హో .... హో .... హో .... హే!



కల్మషాల, కిల్బిషాల,
కశ్మలాల, కర్కశాల,
వికృత కర్కోటకాల
తుడిచిపెట్టు యుగం రాగ;
నరరక్త పిపాసువులకు
పైశాచిక పాశ్వికులకు
సమరోన్మాద కబంధుల
ఖననక్రియా యుగం రాగ;
కాంచనభూతపు ఘల్ ఘల
పెనుసవ్వడి నింపుకున్న
నగరవీధి తిన్నెలపై
ఆకలితో సొమ్మసిల్లి
కదలలేక పవళించిన
దిక్కులేని దీనజనులు —
తుఫానులో కొయ్యబారి
ఆక్రోశించే విషాద
దృశ్యాలను తుడిచిపెట్టు
నవజీవనయుగంరాగ
బ్రతుకు రోత గడుపలేక
మెతుకుగీత తనుపలేక
గేతులతో రేఖలతో
ఆత్మహత్య — బలికోరే

దరిద్రి మానవమూర్తులు
కనిపించని యుగంరాగ;
ఈ వానలు మనపొలాల
కతిథులాయె తమ్ముడా !
యుగాంత సువిశాల విశ్వ
సుస్మేర సుగంధకాంతి
యింటింటా తోరణమై
విలసిల్లును తమ్ముడా !
జనహృదయం సంతసాల
సంబరాల పీరణమై —
నవధ్వనుల ఢమరుకమై —
మ్రోగునింక తమ్ముడా !



హే .... హో .... హే .... హో .... హే !
హో .... హే .... హో .... హే .... హో !
హే .... హే .... హో !
హో .... హో .... హే !
హో .... హో .... హో .... హో .... హే !
హే .... హే .... హే .... హే .... హో !



బ్రతుకు పాట ....
బ్రతుకు బాట ....
బ్రతుకు కటకటాలవేట !
బ్రతుకువ్యధల ——
రొదలమూట ....
బ్రతుకు వెతల కలలకోట !
అతుకుబొంత ....
గతుకుపుంత ....
బ్రతుకు — బండి — బరువునడక !
ఇరులచెంత ....
బ్రతుకువంత ....
మనసుచింత చితులమంట !
కనులగంత ....
చెవులకంత ....
మెతుకుకొరకు సుతలవంత :
దగాకోరు ——
దొరతనాల ....
ఘరానాల కలవరింత !
గళమునిండ ....
గరళముండ ....
పెదవులపై తేనెపూత !
చిలుకపలుకు ....

పంటిమాట ....
నిశితమైన బాకుకోత !
తలపు నలత ....
వలపు కొరత ....
నరుల బ్రతుకులో తేరోత !
ఒకేగాథ ....
ఒకేబాధ ....
యెడద మలుపులో కటేసొద !



హో .... హో .... హే !
హే .... హే .... హో !
హో .... హే .... హో .... హే .... హో !
హే .... హో .... హే .... హో .... హే !
హే ... హే .... హో !
హో .... హో .... హే !



చింత బ్రతుకు కెంతవరకు—
సంతసాలు విరియవా ?
కలత నిదుర కెంతవరకు—
సుఖసుషుప్తి కలుగదా ?

అడుగడుగున గచ్చపొదల-
సంగనాచి దొంగముళ్ల-
బాటలబ్రితుకెంపు వరకు.
నవపథాలు తెరువవా ?
[illegible]క్షుధాగ్ని యెంతవరకు-
కృత సుభిక్ష మమరదా ?
శోకానల మెంతవరకు-
హర్ష హిమము కురియదా ?



హో హో హో : హే హే హే !
హో హే .... హే హో .... హో హే !
హో హే హో,
హే హో హే !
హో .... హో .... హో .... హో .... హే !
హే .... హే .... హే .... హే .... హో !



హిమాలయోన్నత గిరిపై అరుణ మేఘమాల చూసి
గుండెలలో గుబులుకొనే భయమెందులకోయీ!
మన భూములకామని పంచగ వేచినదోయీ !

త్రివిష్టపం హృదయనాళ సంచలనో ధృతినిజూసి
నేత్రయుగళి చెమరించే దుఃఖమేల నోయీ !
పిమ బాముల సమాప్తికై పరిసపవేదనోయీ !

రెండాకులు ఒక్క మొగ్గదళముల పసికందచూసి
ఎదలో పెను బెదురు ముదరకంపమేలనోయీ!
క్షుద్బాధకు తాళలేని నిర్భాగ్యుల చైతన్యమదోయీ !

నల్ల మలల తలల కలలు కరిగి మెరుపు లురలచూసి
సన్నిపాత రోగమున ప్రలాపమేలనోయీ ?
రాకాసుల పరిమార్చే పురుషయత్నమోయీ !

ఆకాశము నంటిపెరుగు రబ్బరు ద్రుమాసులనుచూసి
రక్తఘుసీ ధావమంగి మృత్యువేలనోయీ !
బానిసజన సంకెలల విముక్తి కృత్యమోయీ !



హే హే హే !
హో హో హో !!
హో హే హో ! హో హే హో !
హే హో హే ! హే హో హే !
హే హే హే !
హో హో హో !



ఈశిథిల భవనాన భవము లింకెన్నాళ్లు ?
జనన మరణ మహోగ్ర చక్రభ్రమణమికేల ?
'యవ్వనోవా—వనోవా' యనెడి నానుడికి
నవజీవన విలాస కావ్యమే కామ్యమై—
మారురూపు ధరించి మనుగడల విరచించి
దండపాణుల యాజమాన్యాల నిహతించి
క్రొక్కారులే మొయిలు జాలువారకు కొత్త—
జనుల హృత్క్షేత్రాల క్రొన్ననలు తలలెత్త—
ఈనరకలోక నరలోక గుప్తాగ్నిలో
నవలోక నాకమ్ము మొలిపించ నీయండి !
గతదాస్య భారాల యినుప గొలుసులు మోసి
మ్రగ్గి కగ్గిన ప్రాణశక్తులన్ని నేడు
నవజీవన విభాస రోచు లురలించాలి !
ఈయర్ధ రాత్రిలో భువనాలు క్రమ్ముకొను
నిర్జీవనాంధకారాగాధ పటలమును
జీవశక్తుల పటాలాల్ ముట్టడించాలి !
గగన కల్లోలినీ గర్భకుహరమ్ములో
అరుణ జలదాల నౌకలు విలంఘించాలి !
ఈబధిర పాషాణ జగతిలో బ్రతుకేల ?
జరరుజల మరణాల చక్రగతులెన్నాళ్లు ?



హో .... హే .... హో .... హే .... హో !
హే .... హో .... హే .... హో .... హే !

హే ... హే .... హో !
హా ... హో .... హే !

హే .... హే .... హే .... హే .... హో !
హో .... హో .... హో .... హో .... హే !



కురవనీ — కురవనీ,
తొలకరి పెనువానల జడి
జలజలా కురవనీ !
పొంగనీ — పొంగనీ,
చిలికిన అమృతంపుసోన
గబ గబా పొంగనీ !
ముంచనీ — ముంచనీ,
ఎఱ్ఱవరద లుప్పెనలను
పాతపుడమి ముంచనీ !
ముసరనీ — ముసరనీ,
అరుణ జలదవితతి — గగన
మైదానం ముసరనీ !
విరియనీ — విరియనీ,
మనపంకిల విశ్వ హృదిని
శాంతి సుమము విరియనీ !
ఎగురనీ — ఎగురనీ,
మన విషాద విశ్వముపై
శాంతి క్రౌంచ మెగరనీ !



# శర్వరి గీతం

ఎంతచల్లని కన్నులమ్మా,
ఎంత ఎఱ్ఱని పెదవులమ్మా,
వంతలను మరపించు నీ దర
హాసచంద్రిక లేవి శాంతీ!

స్వేచ్ఛారుణ కాంతిమెరిసే,
స్వచ్ఛకౌముది లెన్నొవిరిసే
శుభ్రగగనతలమ్ములో — నవ
రణవిఘాతములేల శాంతీ!

పాలబుగ్గల మెరపుతావుల
కాలకూట విషమ్ము సోకగ,
నాగసాకీ నగరవీధుల
పాతగాయాలేల శాంతీ!

పచ్చ పచ్చని పంటపొలముల
నెచ్చలులతో కలుపులేరుతు,
మచ్చికోలు పదాలు నింపుతు.
గడుపు మనుగడ లెపుడు శాంతీ!

తూర్పులో యాలూమహానది
ర్పడినదాక విపత్ ఘట్టము,
మార్పులేని జిఘాంసతో — రణ
వ్యాఘ్రములు గర్జించె శాంతీ!

తెగిన కొరియా ఉరోజాలను
రగులుచుండె ప్రతిజ్ఞకీలలు,
వగలు నిండిన నేలలో — పగ
లెగసె దారుణమగుచు శాంతీ !

చలువతెమ్మెర పీచకుండా—
వెలుగురేకులు విచ్చకుండా—
విలుపబ్రతుకుల నింపకుండా—
సమర భీషణమేల శాంతీ !

వలపుచెలి వాతెరల తేనెల,
తలపు తెరుపుల పసిడి సోనల,
నరుల హృదయామృతపు వాకల,
విషదర్ప మొలికిందిశాంతీ !

నీచసమరోన్మాద రాక్షస
కీచకులు భూదేవి నొసటను
పసుపు కుంకుమ చెరుపదలచిరి—
వీచుమా కారుణ్యగీతము !

వీచుమా కళ్యాణగీతము,
కాచుమా వసుమతీ జాతము,
సాచుమా నీవజ్రహస్తము
బోధించుమా జనగణము శాంతీ !



# నీరాజనం

చల్లని పల్లవపాణీ శాంతీ,
మాస్వాగత మిదిగోతల్లీ!

అడవులబడి నడచి గడచితో—
ఒడుడస్సి డస్సి వసివాడితివో?

విలయాగ్ని శిఖలవలయము
మాజగతీ గళమును చుట్టెను,
పరుని దురాశానలమ్మె
వినాశనమై హృతమొనర్చె—

వీక్షించుము చల్లనితల్లీ శాంతీ!
రక్షించుము మల్లెలకాంతీ శాంతీ!

చల్లని కీడొల్లని కపోతాల రెక్కలవేతల్లీ,
నీకోసం కోటిగొంతులెత్తి పిలచెతల్లీ—

అమ్మా స్వాగతమిదిగో శాంతీ!
సత్వరముగ నరుదెమ్మా కల్పవల్లీ!

 



పంటచేల పదతితోడ
పనలసేయు హాలికుడూ
లేమివలన మసిబారిన
లేతుమిషను కార్మికుడూ

కపులూ, కంపోజిటర్లూ, ఫోర్మెన్లూ—
కూలీలూ, పోలీసులు గుమస్తాలు—

సమస్తమానవులంతా ...
నీకోసం బాధలబ్రతుకంతా....

నిరీక్షించుతున్నారమ్మా శాంతీ!
విరోధులను పరీక్షించుతున్నారమ్మా!

తీయని బ్రతుకులకోసం....
పిల్లలు చిరునవ్వులకోసం....

ఎదదలెత్తి ఆహ్వానం చేస్తున్నారమ్మా!
రావమ్మా చల్లని తెల్లనిశాంతీ!



# — : వివరణ : —

1. క్రాంతిగీత : రచన 1947 లో. ప్రచురణ 10-1-48 తేదీ గల 'అరుణ' (కాకినాడ) పత్రికలో.

2. తెలుగు వెలుగులు : 26-4-52 వ తేదీ రాత్రి రాజమండ్రి నుంచి కాకినాడ వస్తూ ట్రెయిన్‌లో వ్రాశాను. మే 25 వ తేదీ "జ్వాల" లో ప్రచురణ.... పతతి మోదుగ పువ్వైరా—బెజవాడనుంచి హైదరాబాదు వెళ్ళే రైలు దారిలో యిరుప్రక్కలా మోదుగలు వసంతంలో ఎర్రగా పూస్తాయి. అంతేగాదు బెజవాడనుంచి హైదరాబాద్ రైనుకున్నవి [illegible] ఎర్రి దీపాలే! ఇదికాక తాత్కాలికమే అయినా తెలంగాణాలో వెల్లివిరుస్తున్న అరుణోదయాన్ని మాత్రం ప్రతిబింబిస్తాయి.

   శ్రీనాథ మహాకవి తన చివరిరోజుల్లో వ్యవసాయవృత్తి స్వీకరించి, వర్షాభావం వల్ల పంటలుపోయి కడుపువాతపడి పన్నులు చెల్లించుకోలేని దుఃఖంతో మరణించాడు. అవిధంగానే అల్లసానిపెద్దన జీవితం కూడా విషాదాంతమే! కలకంఠి కంటినీరొలికిన చోట సిరిసంపద ఉండదని ఏవి సమయం.

   ప్రధాని రాజాజీ 52 ఏప్రిల్‌లో ప్రజలు విషసర్పాలనీ — కనక వుపేక్షచేయడానికి వీల్లేదనీ — కాబట్టే తాను మంత్రిగాదై ప్రధాన మంత్రి పదవిని నిర్వహిస్తున్నాననీ — ఉద్ఘాటించినట్లు పత్రికా వార్తలు.

3. నామాలకోరస్ : రచన ఏప్రిల్ 10 వ తేదీ రాత్రి. 25 వ తేదీ జ్వాలలో ప్రచురణ. దొంగచాటుగా రాజాజీ ప్రధానమంత్రిగా రావడం నలుగురిలోనూ నగుబాట్లయింది. అనాటికి, రాయలసీమలో విజృంభిస్తున్న కరువు కరియప్ప సంచారం, శ్రీకృష్ణాపెన్నారు ప్రాజెక్టు పతంగం, రాజాజీ ప్రకటనలు ఈగేయ రచనకు మూలబీజాలు.

4. విన్నవీ....కన్నవీ : ప్రచురణ మే 16 వ తేదీ జ్వాలలో. ఇందలి ఇతివృత్తం రాయలసీమ కరువు. 'భూజంగుల [illegible] వెళ్ళేలు'

శంగాపు నాయకత్వం వహించిన ఐక్య సంఘటన సభ్యులంతా వాకౌటు చేసిన సందర్భంలో వ్రాయబడ్డ గేయం. ఇందులో రాజాజీకి గల అర్హనామాలన్నీ ద్యోతకమవుతాయి.

8. ఆంధ్రజ్వాల : రచన 5–8–52 తేదీని. ఆసేతు హిమాచలపర్యంతం జనుల ఎదలేలిన మహాకవి — జగన్నాథ పండిత రాయలు.

9. ప్రతిజ్ఞ : 51 సెప్టెంబరు 5 వ తేదీని నాగపూరు వెళుతూ ట్రెయిన్‌లో వ్రాశాను. ప్రచురణ 6–6–52 జ్వాలలో.

10. సవితాకిరణం : రచన 52 నవంబరులో. ప్రేరేపితం సూర్యాపేట తాలూకాలో వ్యాపించిన క్షామ పరిస్థితిపై గూర్చిన విశాలాంధ్ర వార్తలు. ప్రచురణ 23–3–53 విశాలాంధ్రలో. చిత్రకంఠి = పావురము ; గంధసారం = మంచిగంధం : గహనం = అడవి.

11. ధరణీ గీతం : రచన 4–8–52 వ తేదీని. ప్రచురణ 21–9–52 విశాలాంధ్రలో. కలకత్తాలో జరిగిన భారతసంస్కృతి మహాసభలలో అమర్ షేక్ పాడిన హిందీ గీత భావానికి, కొంతకే — ఇది అనుసరణ.

12. నికషోపలం : అంటే గీటురాయి. "ఏ దేశపు స్వాతంత్ర్యానికైనా ఆ దేశపు సామాన్య ప్రజల జీవితమే గీటురాయి" అన్న జవహర్‌లాల్ నెహ్రూ వాక్యమే ఈ గేయానికి ఉత్సాహ మిచ్చింది. రచన 1948 అగస్టు 15 వ తేదీని బసి సబ్‌జెయిల్లో. ప్రచురణ — 15–8–52 జ్వాలలో.

13. శ్రీరామరక్ష : రచన 5–12–52 వ తేదీని. శ్రీ పొట్టి శ్రీరాములుగారి పరిస్థితి విషమిస్తున్నదని వార్తలూ, విజయవాడలో పూర్తిహర్తాల్‌కు అన్ని రాజకీయ పక్షాలు సంయుక్తంగా యిచ్చిన పిలుపూ, శ్రీరాములుగారిని రక్షించుకోవాలనే ఆలోచనా నాలో ఈ రచనకు ఆవేశాన్నిచ్చాయి. 'శ్రీరామరక్ష' అనే మాటకు తెలుగు దేశంలో గల అర్థం — గమనార్హం. శ్రీరాములుగారిని కాపాడుతూ కూడా పొట్టివాళ్ళే! అయితే దురదృష్టవశాత్తూ పొట్టి శ్రీరాములుగారి పూర్ణాహుతి అనంతరం — డిసెంబరు 22 వ తేదీని మాత్రమే విశా

